# ఏకోజీ రామాయణము

## ద్విపద

పరిష్కర్త సంపాదకులు

డా॥ మొరంగపల్లి బాగయ్య

తెలుగుశాఖ ఉపన్యాసకులు

ఉస్మానియా విశ్వవిద్యాలయము

హైదరాబాదు

ఎం. శ్రీనాథ్ కుమార్ పబ్లిషర్స్

హైదరాబాదు - 5000 44

ఏకోజి రామాయణము - ద్విపద
EKOJI RAMAYANAMU - DWIPADA
Editor : Dr. M. BAGAIAH

ప్రథమ ముద్రణ - ఏప్రిల్ - 1993
ప్రతులు : 1000
ద్వితీయ సంపుటము

వెల : రూ. 55/-



ప్రతులకు :

ఎం. శ్రీనాథ్ కుమార్
రమా నిలయము
ఇం. నెం. 12-11-833/4/71
అంబర్ నగర్, అడ్డిక్ మెట్టు
హైదరాబాదు - 5000 44

ముద్రణ :

శ్రీ శబరి ఆర్ట్ ప్రింటర్స్
బసంత్ టాకీస్ ప్రక్కన
లింగంపల్లి - హైదరాబాదు - 5000 27
ఫోన్ : 246645

తిరుమల తిరుపతి దేవస్థానము వారి
ఆర్థిక సహాయము పొందినది

## అంకితము



శ్రీ వేంకటేశ్వరస్వామికి

# విషయ సూచిక

## ద్వితీయ సంపుటము

| క్ర.సం. | | | పుట. |
|---|---|---|---|
| 1. | కిష్కింధా కాండము | .... | 1 - |
| 2. | సుందర కాండము | .... | 27 - |
| 3. | యుద్ధ కాండము | .... | 57 - 1 |

# కృతజ్ఞతలు

'రామా' అనగానే పాపముల నుండి విముక్తి చేయువాడు రాముడు అనే యర్థము స్ఫురించక తప్పదు. ప్రతి ప్రాణి తెలిసితెలియక చేసిన తప్పులు సరిదిద్దుకొనుట మానవ ధర్మము దశాబ్దికాలము నాటి మాట ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు నా మీద గల వాత్సల్యము చేత నాకొక సూచన నిచ్చి యుండిరి. అది డాక్టరేటు పట్టా పొందాలని చెప్పిరి. వారి ఆజ్ఞను శిరసా వహించి నేను అనేక రకముల గ్రంథములను ఏకలవ్యునివలె జూచితిని. ఏ మహానుభావుడు నన్ను దరిచేర్చని కాలములో దివాకర్లవారు నన్ను నాయనా! మీరు ఏకోజి రామాయణముపై Ph. D. చేయుమని చెప్పిరి వారి మాటలు పాటించి నేను ఆ గ్రంథ సేకరణకు బయలు దేరితిని. ఎవరో ఒకరు అవధాని గారికి తటస్థపడి వారు అడిగినంతలో ఈ ప్రతిని నాకిప్పించిరి. ఆ తరువాత APGOML&RI పురా సంచాలకులు డా॥ వి.వి యల్. నరసింహారావుగారు ఈ గ్రంథమును వ్రాసుకొనుటకు అనుమతించిరి. ఆపై డా॥ పి.వి. కృష్ణశాస్త్రి గారు అనుమతించిరి. వీరందరికి నా ధన్యవాదములు.

నా గురువర్యులు ఆచార్యులు ఎం. కులశేఖరరావు గారు నాకన్ని విధముల అండదండలుగా నిండు మనస్సుతో నన్ను దీవించిరి. వారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ గ్రంథములు రూపము దాల్చుటకు శ్రీ వేంకటేశ్వరుడే దయదలచెను. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారు ఆర్థిక సాహాయము చేసి యున్నారు వారికి నా ప్రత్యేక ప్రణామములు.

ఇంకెందరో ప్రత్యక్ష పరోక్షములలో సహాయపడిరి. వారందరికిని నా హృదయపూర్వక నమోవాకములు.

బుధజన విధేయుడు

ఎం. బాగయ్య

# కిష్కింధా కాండము

శ్రీలను మిగుల భాసిలు పంపజూచి
జాలిని రాముఁడా సౌమిత్రి కనియె
యీపంప జూచితే యెలమి సౌమిత్రి
యా పద్మజునికైన నలవియె పొగడ
విరహులు ! చెంతల విహరింతురెట్లు
మరుఁడు సాన్నిధ్యుఁడై మనల నిచ్చటను
యెన్నడు భూమిజ నేజూతు ననుచు
చిన్నబోయిన రాముజేరి లక్ష్మణుఁడు
మనుజేశ నీకింత మనికత మేల
నినసూనునికి మన కిప్పుడె సఖ్య
మవు రావణుని నీవు హరియించి పిదప
నవనిజ చేకొందు వనహారుదుంచి
కార్యమూహింపుచు కదలు జెప్పుచును
సూర్య వంశజుఁడందు సుఖ గోష్ఠి నుండె
ఆలోన సుగ్రీవుఁడా ఋశ్యమూక
శైల శృంగంబుల చరియింపుచుండి
నరగున్న రామ లక్ష్మణులను జూచి
వెరచి యింద్రజుఁడుప్పు వీరిందు మనల
వలగాని వధియింప వచ్చినారనుచు
పలుకు సుగ్రీవుతో పవనజుండనియె
వీరలు ప్రచ్ఛన్న వేషులుగారు
కారణ పురుషులు కపి సార్వభౌమ

తెలసి వచ్చెద వీరి తెరఁగు నీవుండు
మలయాద్రి వసియించి మార్తాండ సుతుని
వటు వేషధారియై వాయు నందనుఁడు
పటు రయంబున వచ్చి ఫలము చేబూనీ
మొనసి పంపా తీరమున నున్న సాధు
జన నుతుండగు రాము సన్నిధి నిలిచి
ధారుణీ పుత్రి మస్తక మణి నింక
నీ రీతి దెచ్చి నీ కిత్తు నన్నట్లు
ఫల మర్థి ఫలమంత్ర కానుక యిచ్చి
కరములు మొగిడించి కాకుస్థు కనియె
అనుపమ రాగ చిహ్నములతో నుండి
మునివేషధారులై మొనసి యీ పనిని
శరచాపములు బూని చరియింపనేల
నరుదయ్యె మీరెవ్వరనిన శ్రీరాము
డతని వాక్యమ్ముల కతని రూపమున
కతని చమత్కృతి కాత్మలో మెచ్చి
కను సన్న సేయ లక్ష్మణుఁడు గుర్తెరిగి
వనచరులతో పూసవడి సూచినట్లు
తాము వచ్చిన పని తమతెరంగెల్ల
నామూలముగ దెల్పి యతని కిట్లనియె
నీవెవ్వడవు భువి నీకు పేరేమి
నీవిధంబెల్లను నిజముగా దెల్పు

మనవుఁడు హనుమంతుడను పేరువాఁడ
యిన తనూజుని మంత్రినే వాయు సుతుఁడ
సుగ్రీవుఁడత్యంత శూరుఁడు శత్రు
నిగ్రహానుగ్రహ నిపుణుఁడా ఘనుని
మీకు బంటుగను నెమ్మిగా చేయనేర్తు
మీ కటాక్షంబు నామీద కల్గినను
నావుండు రాము మానసము గుర్తెరిఁగి
భావించి సౌమిత్రి పావని కనియె
సత్య సంధుఁడు దయాశాలి సచ్చరితుం
డత్యంత బలుఁడు మహావీరుఁ డితడు
రాముఁడు లోకాభిరాముండు విజయ
ధాముఁడు విక్రమోద్దాముఁడు దారుం
డీ విభునిల్లాలిని తని వంచించి
రావణుఁ డెత్తుక రయమున బోయి
వదలక దుష్ట రావణు సంగరమున
ను దరి చంపగ నితం డొక్కఁడెఁ జాలు
దనరఁగ మేమేకతంబున బోవ
జనదు మాకిది రాజ ధర్మంబు గాదు
గాన సుగ్రీవుని గైకొను తలఁపు
మానవాధీశ్వరు మదిలోన గలదు
కావున కార్యంబు ఘడియింపు మనిన
పావని పొంగి సద్భక్తితో మ్రొక్కి

యినజుని కడకేఁగి యిట్లని బలికె
వినుము సుగ్రీవ నీ వెరపెల్ల దీరె
లోక సాగరమున సుడి గొనుచున్న
నీకు రాఘవుఁడను నెర వేర్పు గలిగి
అనిన రాము సౌమిత్రు లాడిన మాట
లనుపమ శౌర్యంబు లా పంక్తి ముఖుఁడు
జనకజ నెత్తుకొనిచన్న చందంబు
వినిపింప వనచర విభుఁడుత్సహించి
హనుమంతు నీవను యంజనంబునకు
కనుగొంటి నేను రాఘవ నిహనంబు
గరిమెతో ఋష్యమూకమునకు వారి
పరువడి తెమ్మన్న పవనంబు దరిఁగి
తదయక మూపుల దశరథాత్మజుల
నిడుకొని తోడ్తెచ్చి యెలమినా గిరిని
విడియించే వనచర విభు చేర బోయి
వడి జెప్పి వారలు వచ్చిన తెరఁగు
దిన నాథ తనయుని దెచ్చి సంప్రీతి
పెనుపొంద రఘురాము భేటి సేయింప
జలజాప్త సుతుడంత సద్భక్తితోన
జలజాప్త కులునికి సాష్టాంగ మెరిగి
ముకుళిత హస్తుఁడై ముందర నిల్వ
సకలేశ్వరుఁడు కవి చంద్రుని జూచి

ఆలింగనముజేసి హనుమాంతుచేత
నీలావు నీరీతి నీ విక్రమంబు
విన్నాను సుగ్రీవ వెరవు నీకేల
నెన్నని పగవాని యేనె జంపెదను
నీవు నా సఖుఁడవు నీవు నా హితుఁడు
నీవె నా జీవంబు నిజముగా నెంచు
మన భాను నముదనుఁడా రాము జూచి
నా వంటి బంటు మిన్నక నీకు గల్గె
దేవ రావణుని వధించి యా భ్రాత
ననువొంద గైకొంటినని నిశ్చయింపు
మనిరామ సుగ్రీవులఁన్యోన్య భాష
లనలు సన్నిధి బల్కి యకళంకులైరి
హనుమంతుఁడంత చేనటు సంజ్ఞసేయ
నా వానరేశ్వరుండవనీ తనూజ
భావించి తన చెంత వడవైచినట్టి
సొమ్ములు దెచ్చియ్య చూచి రాఘవుఁడు
నెమ్మిగైకొని చేర్చి నేత్రాంబుజముల
తలంచి మూర్ఛిలి కొంత తడవుకునట్టె
తెలసి సుగ్రీవుని దెస జూచి బలికె
ధరణిజ చెరగొన్న దాన వాధముని
పురము దేశంబు నొప్పగదెల్పుమనిన
ఇనజుడిట్లనె రామయేవాని పురము

కినివిని యెరుగను గన కొన్నవాని
నెరుఁగు తెరంగెల్ల నెరిగింతు నీవు
పరితపింపకు నేను బలివాలిచేత (చా)
హృత కళత్రుడ(నయ్యు నింత శోకింప
ధృతిలేని పురుషుడు తృణ సమానుండు
మా వెండి ప్రాకృతమనుజుల మాడ్కి
నీవు శోకింపకు నెమ్మది నుండు
మనవి రఘురాముడాత్మలోపలను
జనక పుత్రిని పూని సాధించుపనికి
పనువడి మునువీవి పగదీర్తు ననుచు
మొనసి సొమ్ములను తమ్ముని చేతికిచ్చి
వనజాప్త సుతు జూచి వాలికి నీకు
ఘన విరోధముగల కారణంబేమి
తెలుపుమటన్నను దిననాధసుతుండు
పలికెనప్పుడు రామభద్రుని జూచి
మాయావియనువాడు మనుజేశమున్ను
పాయకవాలితో బవరంబుజేసి
బలమెల్ల తూలిన పారి యీకొంటి
బిలములోపల చచ్చు భీతుడై యసుర
బలవైరి సుతుడు వెంబడి వచ్చి నన్ను
బిలము వాకిట నుంచి బిలములో జొచ్చి
ఒకయేడు వానితో యుద్ధంబు సేయ

ప్రకటమై రక్తంబు పై నుంచి రాగ
కనుగొని యార్చు రాక్షసుని నాదములు
విని వాలి దైత్యుచే పెసనీల్గెననుచు
బిలము వాతను నొక్కి పెనుగిరితో(సిన)
యలరు కిష్కింధకు నరుగు దెంచితిని
దట్టించి మంత్రులు తనకు (రాజ్యంబు) పట్టంబు
కట్టిన రాజ్యంబు గావింపుచుంటి
బలవైరి సుతుఁడంత పగతుని గూర్చి
బిలము వాకిట కొండ పిండిగా దన్ని
వడిని కిష్కింధకు వచ్చి రాజ్యంబు
కడిమి జేసెడి నన్ను కనుగొని కనలి
నేమ్రొక్కి వేండినని నిరసించిగాదు
కామిని రాజ్యంబు గైకొని చంప
కదగిన వచ్చి యిక్కడ నున్నవాఁడ
యెడసి వాలికి గిరి యెక్క రాదనిన
విని రాముఁడద్రి ఖావిరి వాలికెట్లు
జనగూడ దనకపి చంద్రుడిట్లనియె
తొల్లిమహిషా కృతి దుందుభివచ్చి
వెలయు తర్పమున దిగ్విజయంబు జేసి
వాలితో పోరాడ వాలి కోపించి
వాలినా శక్తితో వానిని జించి
పనుపడి రిపు కళేబరము తన్నుటము
మొనసి యోజన దూరమున బోయి బడియె

నారక్త మీ శైలమందు జిందగను (లేదు)
నారసి వాలి నీయచలేంద్రమెక్కి
రాకుండ శపియించె రామమతంగు
డా(నా) కారణంబున నానాటి మొదలు
నీకొండ నివసి(యి)ంతునేను నిర్భీతి
నా కళేబరము నత్యంత దూరంబు
చిమ్మిన నిను విశ్వసింతునేననిన
సమ్మతి రామ (నా) చంద్రుండు నవ్వి
ఘనమైన యా కళేబరమునం గుష్ఠ
మునపది యోజనమ్ములు మీదివైచె
వైచిన నమ్మక వనజాక్షకులుని
చూచి సుగ్రీవుండు సౌరంధి యిట్లనియె
వాలి యీ కాయంబు వడిజిమ్మినాడు
చాల శోణిత మాంస సహితమైయుండి
వూని యేచిన దీని పోజిమ్మినంత
దాన విశ్వాసంబుద గలదు తనకు
తాళంబు లేడును తగ కూర్చిపట్టి
వాలి పత్రంబులు వడిగోయుమున్న
నడలక నొక కోల సప్త తాళముల
నదరచేసితివేని యావాలి కన్న
బలశాలివనుచు నేర్పడనమ్మవచ్చు
కలఘుని శ్రమయన్న నతడంత నవ్వి
శరము సంధించి యాసప్త తాళములనే
పరువడి (పరువడి) నేయ నా బాణంబు తాళ

ముల గూల్చి పాతాళమున జూచి మగుడి
పొలుపైన యమ్ముల పోద జూచెనంత
శరలాఘవము జూచి జలజాప్తసుతుడు
కరములు మొగుడించి కాకుస్థు జూచి
వాలి ద్యావర కింక వధియించుటెంత
నీలావు శౌర్యంబు నేజూడనైతి
గైకొంటి రాజ్యంబు గైకొంటి తార
గైకొంటి రుమనునీ కారుణ్య మహిమ
నపరాధినపరాధిన పరాధినైతి
కృపజేసి మన్నింపు కీశుందననిన
నిగ్రహానుగ్రహనిధి రాముడపుడు
సుగ్రీవు జూచి యీ శుభ లగ్నమునను
చెచ్చెర నీవు కిష్కింధకు బోయి
నచ్చట వాలితోనని సేయుచుండు
వాలిని నేనొక కోల వధియించి (నీకు)
వాలిన రాజ్యంబు వడినిత్తు నన్న
నాతోన సుగ్రీవు డారాము నెరిగి
నీల తారానలా నిల తనూభవులు
చేరి సేవింప కిష్కింధ కేతెంచి
పోరికై దేవేంద్రు పుత్రుని బిల్వ
శరచాపములు బూని సౌమిత్రితోన
తరువు చాటున నుండి తగినంత రాముం

డప్పుడు రవిజుటా రాలాపములను
ముప్పిరి విని కోపమున వాలి వెడలి
సుగ్రీవు మార్కొన్న సుగ్రీవుడంత
నాగ్రహంబున వాలి నదరక తాఁడె
నీరీతి వారిద్దరేక రూపముల
పోర రాముడు జూచి బుద్ధిలో భ్రమసి (8)
యిన తనూభవుండి తండింద్రజుండీతం
డనియెర్పలింపగ నలవినిగాదకట
పదరి నేనిప్పుడు బాణ మేసినను
తుది నెవ్వఁడని లోన త్రుంగు నోయనుఁచు
విడపక శరము భూవిభుడుండెనంత
బెడిదంబుగా వాలి పెడచేతి కొద్ది
సుముకుల మేనెల్ల గుల్లలై వెరచి
మిడుకుచు తన తోక మెడమీద వైచి
యదరుచు ఋశ్యమూకాద్రిని జేరె
నినజుఁడచ్చట రాముఁడే తేరజూచి
తన తలవంచి యద్ధరణీశుఁడనియె
శ్రీరామనిను విశ్వసించి నేబోయి
భోరున వాలితో బోరితిగాని
కాకున్నపోదు నేకటకటా కావు
నాకు నమ్మికలిచ్చి ననుగావవైతి
వనుఁడు సుగ్రీవ మీరగ్రజానుజులు
వసవడి నేక రూపములుగా పోర

కని యెవ్వఁడీల్గునో కడపట ననుచు
యెనసిన శరము నేయక యుంటి
గరిమెతో నింక నీ గజపుష్పమాటల
ధరియింపుమని యియ్య ధరియించి రవిజుం
డారాజ పుత్రుల కట వినోదముల (చూపుచు)
శూరుఁడై చూప మెచ్చుచును రాఘవుఁడు
వాలిపాలిత హిమ వప్రసౌధాళి
కీలితంబైన యాకిష్కింధ జూచి
మాను చాటున నుండె మనుజేశుఁడంత
భానుపుత్రుఁడు మంత్రిపతులతో బోయి
గిరులు చేదిల్ల కిష్కింధ వాకిటను
పరగ నార్చివిని బలవైరి సుతుండు
తానొక బంటు చందమున నేతెంచె
వీని చంపెదనని వెడలంగ జూచి
తారయిట్లనె దేవత వనజు మీఁద
నీ రీతి పోచన నిది మేలు గాదు
నొచ్చి నీచేబోయి నోరాడి మగుడ
వచ్చునే యితఁడు లావరి ప్రాపులేక
నదిగాక నొక సుద్దియంగదుచేత (చా)
విదితంబుగా వింటి వినుము శ్రీరాముం
డతివె రావణుచేత నటుగోలు బోయి
ధృతిబూని చేపట్టి దినకర సుతుని

నిను వధింతు నటంచు నెమ్మినున్నాఁడు
చని రాము శరణని సంధిగావింపు
మన నవ్వియింద్ర జుఁడతివ కిట్లనియె
తనవంటి పతియుండ తార నీకిట్టి (మ)
వినుము రాఘవుడాది విప్లవము నమ్మి
నీకితడేల నీమాట చాలించు
శరణని రిపులు నా సన్నిధికార
పరుల నేనెటువలె ప్రార్థింతుచెపుమ
సరగ యుద్ధమునకై శత్రువు బిలువ
వెరచి యుండుట యొక్క వీరధర్మంబె
వీరుఁడు నీతి కోవిదుఁడు శ్రీరాముం
డూరకె నన్నేల నొగి చంప దలఁచు
ననియూరడించి యాయజ్ఞాక్షిననిచి
యనిమిషేశ్వర పుత్రుఁడగు వాలివెడల
శరధులు కలగి భూచక్రంబు పగిలె
గిరులెల్లడుల్లె కిష్కింధఘూర్ణిల్లె
నప్పుడు వాలిని తృణము గానెంచి
పోరియింద్ర తనూజు వుల్లంబులోన
నాగ్రహంబీ యడనఱచు నేతోటి
సుగ్రీవుఁడను గాను చూచి పోరాడు
మని మహాసాలంబు నగలించి తెచ్చి
ఘనమైన వాలి వక్షంబు తాడింప

కంపించి మూర్ఛిల్లి కపిరాజు తెలిసి
పెంపొందు రవిజుపై పెనుకొండ వైచి
వైచిన నా కొండవాలాగ్రహతిని
చూచి సుగ్రీవుండు చూర్ణంబు జేసె
చరణంబులను దన్నె శతమఖ సుతుఁడు
కరముల నొప్పించె కనులార్త తనయుఁ
డీరీతి నిరువురు నేకమై పోర
తాలి సుగ్రీవుడ త్తరి వాలి చేత
పెదవులు దడపుచు పెంపెల్ల బొలసి
గుదికొని భ్రమసి దిక్కులు జూచుచుండె
నప్పుడు రఘురాముడర్కజు బలిమి
తప్పిన కనియిక తగదూరకుండ
ననియమేషాస్త్రంబునపుడు సంధించి
వనధులు కలఁగ గీర్వాణులు బెదర
వానరమణి సూను వాంఛ తీడేర
వాసవాత్మజు దృఢవృక్షంబునేసె
నాయస్త్రహతిచేత నద్రిచందమున
పాయక నావాలి పడియె భూస్థలిని
యవశుఁడై పడియున్న యావాలిడాయ
రవి వంశమణియైన రాముఁడు రాఁగ

తెలిసి మెల్లనె రాము దెస జూచివాలి
పలికెను కోప సంభరి తాత్ముఁడగుచు
ధర్మాత్ముఁడై యుండి తగునె నీ కిట్టి
కర్మంబునకు నొడి గట్టి శ్రీరామ
అడవి మృగాదుల నణతురు గాని
పుడమి కోతులను చంపుదురె భూపతు
లన్న తమ్ములము మేమతరి పోట్లాడ
నన్ను జంపుట నీకు నాయమే రామ
యని యిట్లు హేతువు లాడనా వాలి
కనుగొని యంత రాఘవుండిట్లులనియె
కట కటా వాలి మర్కటు బుద్ధివలన
యిటులాడెదవు దీని నెంతురే బుధులు
నీ సహోదరుని మానిని బుచ్చుకొన్న
దోస విసీ నిన్ను ద్రుంచుట తగవె
మీఁది పారెడి దుష్ట మృగముల చెట్టు
చాటున కడుఁ పొంచి చంపరే నృపులు
తన మిత్ర శత్రువు తన శత్రువగుట
నిను జంపితిని యిది నీతి యన్నంత
విని సర్వ గీర్వాణ వినుతనూభవుడు
కను మోడ్చి మూర్ఛిల్లి కదలక యుండె
నంత తారాది వామాక్షులు వచ్చి
వంతల బడియున్న వాలిని జూచి
కడలేని శోకాబ్ధి కడుపడి మునిగి
కడగట్టు గానక కళవళ జెంది

యోజీవితేశ్వర యోమహోదార
యోజయ శ్రీమంత యోబలవంత
నన్ను వంచన జేసి నా మాట త్రోసి
యిన్నర నాధుచే నిట్లు కూలితివె (!)
యనితార విలపించి యర్కనందనుని
కనుగొని దూరి రాఘవుని కిట్లనియె
నో రాఘవేశ్వర యోమహావీర
వూరకె వాలినిట్లొడి చంపతగవె
నీ నీతి నీమతి నీదు విఖ్యాతి
జానకి వెంటనే జనియె నో జెపుమ
దేవేంద్రనందను తెగటార్చునట్లు
దేవ నన్నిప్పుడు తెగ టార్చుమనుచు
శోకింపుచును తన సుతుని యంగదుని
చేకొని తలఁకుచు చింతింపుచుండె
అంతలో తెప్పిల్లి యమరేంద్ర తనయుం
డంతంత విలపించ నంగదు జూచి
పరితాపమందుచు భానుజున కనియె
నెరియ భాను తనూజ నీకేల వగవ
జగమెరుగఁగ రామచంద్రుని వలన
పగదీరె నేడు నిర్భయుడవై యుండు
యే మాట జెప్పినన్నిట్లు జేసితివో
యా మాట రామునికమర జెప్పింపు

బాలుఁడంగదుఁడు చేఁబట్టి రక్షించు
మాలిమి విడకనా మారుగా జూడు
దొరల చిత్తమ్ము విద్యుత్తులు గాన
పరగ రాముని పట్ల భక్తితో నడువు
మునికోని కపి రాజ్యమునకు చిహ్నంబు
కనకమాలికె నీవు గైకొనుమనుచు
యిచ్చి సుగ్రీవుని కెలిమితో చేర
వచ్చిన నంగదు వగపెల్లజూచి
నాకూర్మి నందన నా నిధానంబ
శోకింప నీకేల సుగ్రీవుడుండ
వెస రామచంద్రుని విడువక కొలువు
మసలక సుగ్రీవు మాటతో నడువు
మనుచు బుద్ధులు చెప్పి యా రాము జూచి
మను కులాంబుధి సోమ మనుజేశ రామ
నీ వాకి మూర్తిని నీ దివ్యమూర్తి
బాపించి యీజగ పావనుండైతి
జీవముల్ నెమ్మైన నిట్టాడ దొఱఁగె
దేవ యీ బాణంబు దియ్యవే యనిన
నీలాడు నృపునాజ్ఞ నిజ భుజ శక్తి
వాలిన బాణంబు వడి తీసెనంత
పరమ సుజ్ఞాన తత్పరుఁడైన వాలి
పరమ విస్మయ వస్తుపదమందెనంత

తారాది కాంతలు తక్కినవారు
వీర వానరులెల్ల విలపింప జూచి
సౌమిత్రి వారల సంతాపమార్చె
రాముడాజ్ఞాపింప రవిసూనుడపుడు
వాలికి పరలోక వైదిక క్రియల
నాలోన గావించి యంగదుతోన
పరిశుద్ధుడై రామభద్రుని కెరగ
కరుణించి రాముడా కపులతో ననియె
కపులార సుగ్రీవ కపి శిఖామణికి
కపిరాజ్య పట్టంబు గట్టుడనంగ
వారు రామునికిని వలనొప్ప మ్రొక్కి
తారాది కాంతల తపన తనూజు
నంగదు నంతట నాందోళికముల
సంగతిగానుంచి సరగున దెచ్చి
వచ్చి కిష్కింధకు వలనొప్ప సభను
చెచ్చెర మణిమయ సింహాసనమున
పూని తూర్యంబులు భోరున మొరయ
భానునందను నుంచి పట్టంబుగట్టి
కవగూడి కపులు నంగదుతోడిదెచ్చి
యువరాజ్య పదమున నొప్పుగా నిల్పి
నంతః పురాంగనలందరు మదిని
సంతసిల్లిరి రామచంద్రు కొండాడి
భానునందనుడంత భక్తితో వచ్చి
కానుకల్ దెచ్చి రాఘవుకిచ్చి మ్రొక్కి
దేవ కిష్కింధకు తెరగొప్పనిపుడు

వేవేగ దయజేసి వేంచేయు మనుడు
సుర మహీధర ధైర్య సుగ్రీవ వినుము
పురముల వసియింప మునులకు తగదు
వానకాలము వచ్చె వైరులమీద
పోనేరమిక నీవు బోయి కిష్కింధ
ననువొంద వసియింప మామాల్యవంత
మున నుండు నేను నిమ్ముల శరత్కాల
మరుదేర రమ్మని యర్కజు బనిచి
తరుణి వంశజుడంత తమ్మునితోన
నామాల్య వంతంబునందు వసించి
కోమలి గుణములు కొనియాడుచుండె
నంత శరత్కాల మరుదేరజూచి
చింతించి రాముఁడు సీతను తలచి
సౌమిత్రి జూచితే జలజాప్తసుతుఁడు
కామాంధుఁడై యుపకారంబు మరచి
మగువలతో పానమత్తుడై రాడు
తెగడి సుగ్రీవుని తెమ్ము పొమ్మనిన
శరములు మోడ్చి లక్ష్మణుడట్టె వెడలి
వరుసతో కిష్కింధ వాకిట నిలువ
యా శూలిబోలు రామానుజు జూచి
కీశులెల్లరు పార కిచకొట్టుకొనుచు
నా లక్ష్మణుని రాక యంగదుచేత
నాలోన విని కమలాప్త నందనుడు
తారాది సతులతో తగనేగుదెంచి
కోరి యా సౌమిత్రి కోపంబుమాన్చి

వివిధ పూజలొనర్చి వివిధ ప్లవంగ
నివహంబు తెమ్మని నీలుని బనిచి
నలవొప్పు చున్న వానరులతో గూడ
జలజ బాంధవ తనూజాతుడాపొద్దె
సౌమిత్రి వెంబడి చనుదెంచి గిరిని
రాముని పొడగని రయమున మ్రొక్కి
దేవ నా సేనలే తెంచునీ వేళ
భావింపుమన రామభద్రుఁడుప్పొంగి
మన్నించి రవిజుని మదిలోన సుప్ర
సన్నుఁడై యుండె నా సమయంబునందు
నీలాచలమునందు నిషధాద్రియందు
కైలాస గిరియందు కనకాద్రియందు
శోణాచలమునందు సోమాద్రియందు
ద్రోణాచలమునందు తుచనాద్రియందు
ఋషభాచలమునందు ఋష్యాద్రియందు
వృషభాచలమునందు వింధ్యాద్రియందు
నా రత్నగిరియందు సప్తాద్రియందు
పారియాత్రమునందు ప్రాగ్గిరియందు
మలయాచలమునందు మంధాద్రియందు
నెలకొని వర్తించు నిరుపమా కృతులు
భీషనాతేజుల భేద్య విక్రములు
శేషాహి సన్నిభాజాను బాహువులు
పవమాన సూనుండు పనసుడంగదుఁడు
గవయుండు శరభుండు గంధమాదనుఁడు
పావకాక్షుఁడు కాలపాశుఁడు నీలుఁ

డా వేగదర్శియు నగ్గవాక్షుండు
నలుఁడు మైందుఁడు మహానాథుఁడు నూ|ముఁ
దలరపు జంఘుఁడు నగ్గిరి భేది
|త్రిముఖుండు దసరి జ్యోతిర్ముఖుండు
విముఖుండు తారుండు విగతుండు గజుఁడు
జాంబవంతుండును సంపాతిరంభుఁ
దంబురాశి తనూజుడగు సుషేణుండు
శతవరిహరుఁడును సంస్కాధుఁడాది
వితత శౌర్యులు కపివీరులున్నతులు
తమతమ సుతులును తమ సహోదరులు
తమ చుట్టముల గూడి ధరయెల్లనిండి
గణనా పరంపర గడచి యేతేర
రణ భయంకరుఁడైన రాముండు జూచి
యిచ్చతో నుప్పొంగి యినజు కౌగిటను
మచ్చికతో జేర్చి మన్నింపు చుండ
యూవేళ సు|గ్రీవుఁడధిపలిఁ జూచి
దేవసీదేవిని తెరగొప్ప తేగ
నొక్కడొక్కడె చాలు యుర్వీశయనిన
నెక్కొన్న మైత్రిచే నృపుఁడిట్టులనియె
యిన తనూభవ నీకు యెవ్వరుసాటి
యనువుము వైదేహి సరసిరానిపుడు
విని రామునికి |మొక్కి వేగ సు|గ్రీవు
డొనర నుత్తమమైన యొక్క లగ్నమున
వినతుని వానర వీరుని బిలిచి

ఘనుపడి యుత్తర భాగమంతయును
కనకాచలంబాదిగా దేశములను
వనజాక్షి సీతను వలనొప్ప వెతకి
నిలువక నటబోయి నెల లోనరమ్మ
నలవడి రాకున్న నాజ్ఞసేయింతు
నావుడు లక్ష వానరులతో గూడి
వేవేగ వినతుండు వెడలె నంతటను
హనుమ దంగదనీలహర జాంబవంతు
లను జూప కపిరాజు లలితతా పలికె
ధరణిజ వెదకి యీ దక్షిణంబెల్ల
పరువడి నెలలోన ప్రతివార్త తెండు
పొమ్మన్న వారలు పొంగిరాలోన
రమ్మని హనుమంతు రాముండు బిలిచి
జనకజ పొడగాన జాలుదువీవు
మునుకొని సీతకీ ముద్రిక యిచ్చి
సీత సేమము దెమ్ము శీఘ్రమేయనిన
నాతడాముద్రిక నౌదల దాల్చి
వుదయార్క బింబము నుజ్జ్వలంబైన
పుదయా చలము మాడ్కి నొప్పెనావేళ
కరములు మోడ్చి రాఘవునికి భక్తి మ్రొక్కి
సరిగె వాయుజుడంగదాదుల గూడి
యానుషేణుని జూచి యర్కజుండనియె
వానిగా నొక లక్షవానరుల్ గొలువ
పతమటి దిక్కెల్ల భామను వెదకి



గడువు దప్పక రమ్ము కడగి పొమ్మన
వాడేగె నంతట వనజాప్త సుతుఁడు
వేడుక శతవలి వీక్షించి పలికె
వలగొని యొక లక్ష వానరుల్ గొలువ
తిలకించి యాపూర్వ దిగ్భాగమెల్ల
పూసచందంబున భూమిజ వెదకి
మాసంబు గడువు రమన్న వాడరిగె
తగపూర్వ పశ్చిమోత్తరములు వెదకి
జగదీశు పనుపున చన్నవానరులు
యెండాక యినశశ్కులెపుడు దీపించు
నందాక చనిచని యోదేశములను
నళినాక్షివెతకి కానక కీశపతికి
చెలువేది ప్రతివార్త జెప్పిరంతటను
హనుమదాదులు బోయి యట దక్షిణమ
వనములు దేశముల్ వలనొప్ప వెదకి
బిట్టైన దప్పిచే బిలములో జొచ్చి
పొట్టనిండ జలంబు పొలుపొంద గ్రోలి
యందు స్వయం ప్రభయను భామగాంచి
వందనంబులు జేసి వనజాక్షి కెరగి
యరుదెంచి యా మహేంద్రా చలంబున
నరిగి యందరు గూడి యలరియోజనలు
జేసి యామితిదప్పె శ్రీరాముపనులు
జేసెదమని వచ్చి జేయలేమైతి
మాజ్ఞాన దురంధరుఁడైన సుగ్రీవుఁ

డాజ్ఞలు సేయించు నటమున్న మనము
ప్రాయోపవేశ మేర్పరచి మేనులను
బాయుదమని దర్భపైనుండి కపులు
పొరలుచుండగ వాలిపుత్రు డిట్లనియె
హరహర యెటువంటి హానివాటిల్లె
రాముఁడు విడిచి యారాజ్యంబు విపిన
సీమకు రానేలసీత రావణుఁడు
చెరగొని పోనేల చేరి జటాయు
వరిమురివానిచే నని గూలనేల
నా రాఘవేశ్వరుఁడర్కజుతోన
గారవంబునను సఖ్యము గాలనేల
జనకజ వెదకను చనుమననేల
పనుపడి మనకు నీ పనులు రానేల
ననవుడా మాటల నాలించి చేవుల
ఘనుడు సంపాతి భక్షణ బుద్ధిమాని
యను జన్ముఁడైన జటాయువు తెరగు
విని విస్తరంబుగా విలపించి కొంత
చని యబ్ధిలో కృతస్నానుఁడై వచ్చి
తన పూర్వకథ కపి తతులకు చెప్పి
శ్రీరాము కార్యంబు సేయగ తలచి
మీరిందు వచ్చుచో మీకటాక్షమున
ఱెక్కలువచ్చె మీరీక్షింపుడిదిగో
పతికింప నాజన్మ పావనంబయ్యె
మీరు వైదేహిని మిన్నకబోయి

వేరొండు యెడలను వెదకంగ వలవ
దదిగొ లంకాపురం బాపురంబునను
సుదతియున్నది మది శోకింపుకొనుచు
చనుడు లంకకటంచు సరభసవృత్తి
చనియె హేమాద్రికి పంపాతియంత
వనచరులెల్ల దుర్వార కల్లాత్యఘునటధ
ఫేన భీకర దుష్ట విపులనుసత్వ
జనితారవాభీల సంతత క్షార
వననికరోల్లాసి వనరాశిడాసి
యీ పయోనిధి జూడ హృదయంబు కలగె
నీ పయోనిధినిదాట నెవడు సమర్థుం
డని యని చింతింప నాజాంబవంతు
డనువొంద సంప్రీతి హనుమంతుకనియె
నీ వొక్కడవుం దక్క నీపయోరాశి
దేవతావళికైన దృష్టింప తరమె
నీ మహాసత్వంబు నీ పౌరుషంబు
నీ మహోన్నతి నుతి నేసేయగలనె
శ్రీరాము కార్యమై సింధువుదాటి
యా రావణుని పురంబల్లన జూచి
సీతను జూచి యాసీత క్రమంబు
భూతలేశ్వరునికి పొందుగా జెప్పి
యాచంద్ర తారార్కమాయువు కీర్తి
భూచక్రమందున పొందుమెమ్మన్న
వాయుజుండప్పుడా వార్తకుప్పొంగి

పోయక రఘురాము భావించి మ్రొక్కి
వినుతింప వనచర వీరులంతంత
ననువమంబగు మహేంద్రాచలం బెక్కి
తిరమొప్ప జలనిధి తృణముగానెంచి
సురు శక్తిదాట నుద్యుక్తుండై యుండె
అని భోసలాబ్ధి సుధాంశుడు త్తముఁడు
ధననాథతుల్యుండు దారవిక్రముఁడు
సరస సాహిత్య లక్షణ చక్రవర్తి
కరుణా సముద్రుండు కవి కల్పకంబు
విలసిల్లు తుగజ భూవిభు కుమారకుడు
పొలుపొందు మేకోటి భూమిపాలకుఁడు
తనతండ్రి తుళజేంద్ర ధరణీశు పేర
జెనుపొందు మకరంద బిరుదాంకు పేర
శ్రీలు రంజిలు శబ్దచిత్రార్థ సంగతుల
నవని కిష్కింధాఖ్య నమరునీకాండ
నవిరళంబగు శయ్య నమరంగజెప్పె
నిది తుళజేంద్రుల కిడునెప్పుడిలను
పొదలు సంపదలను పరిపూర్ణశక్తులను
సకల దీర్ఘాయుష్య సంతానములను
సకల రాజ్యంబులు సకల భోగములు
సమర జయంబులు సకల సత్కీర్తు
లమరంగ నొసఁగు మహరామ చరిత
మిది మహాపుణ్యదమిది వేదసార
మిది ముక్తిసోపానమిది శుభోదర్క

మివ్య సుంధరదీని భక్తినెలమితో దీని

నెవ్వరు చదివిన నెవ్వరు వినిన

నెవరు వ్రాయించిన నెవరు వ్రాసినను

భువిలోన వారికి పుత్రసంపదలు

ఘనమైన కీర్తులు కరితులంగములు

మనసు రంజిలజేయు మానినీమణులు

పరగ దీర్ఘాయుష్యభాగ్యంబు లొసగు

ధరణిలోనా చంద్రతారార్కముగను

# సుందర కాండము

శ్రీ రఘువీరుని చిత్తాంబుజమున
వారకనుంచి దుర్వారుఁడై పేర్చి
హనుమంతు డామహేంద్రాద్రి పైనుండి
ఘన సుధార్థము జను గరుడుని మాడ్కి
జేర్చి పదంబులు చెవులు నిక్కించి
యార్చి వాలము తన హస్తంబు లెత్తి
యమరారి పురిమీద నటుదృష్టి నిల్పి
కొమరొప్ప హుంకించి కుప్పించి దాటి
పోవుచునంత నంభోధి మధ్యమున
భావించి మైనాకు పరగ మన్నించి
సురసను సోలించి సొరదియై నీడ
చరగొని లాగించు సింహిక నణచి
యా సువేలాద్రిపైనటు విశ్రమించె
నా సమయంబున నర్కుండు గ్రుంకె
దురి తాత్ముఁడగు సురద్రోహి పాదములు
పరగ దిక్కులయందు పరగిన మాడ్కి
గిమ్మని చీకట్లు కెలకుల నిండి
పమ్మె రాత్రి నభోభాగంబు లెల్ల
గ్రమ్మె నా పురిలోని కలకలంబణగె
నిది నాకు తరియని యలమి వాయుజుఁడు

వదలక చనికోట వాకిలి జొచ్చి
లంకిణి పరిమార్చి లంకలోనున్న
పంకజానన సీత పరికింప బూని
కనక సౌధంబుల కనక హర్మ్యముల
కనక గోపురముల కనక గేహముల
సరస కాంతాధి వాసముల సానువుల
విరుల చప్పరముల విపణి మార్గముల
నందు నిందనకను నాలంకలోని
సందుల గొందులయందు సకలంబు వెదకి
రావణులోక విద్రావణు నగరు
వేవేగజేరి భావించి యచ్చోట
కాంతల నెల్లను కలయ శోధించి
అంతఃపురంబున కరుగు నవ్వేళ
పగటింటి దొర జూడు పద్మసైతోడు
తొగల మేల్వాఁడు కంతుని నేస్తకాఁడు
సురలపాలిటి కూడు సుధలకు వీడు
సొరది చుక్కలరేఁడు చూపట్టెమింట
నాచందురుని జూచి యాదల నుంచి
యా చిత్రసభలెల్ల నసువొంద వెదకి
కని కుబేరుని పుష్పకమున శోధించి
యనిల నందనుఁడంత యంతఃపురమున
నరిగి నానారత్న హాటక చిత్ర
భరితమౌ నొక దివ్య భవనంబు నందు
గరు దోరగామర గంధర్వ యక్ష
నరసిద్ధ సాధ్య కన్యలు భీతితోన

నిలిచి నిద్రారక్త నేత్రతై యుండు
వలనొప్ప సొలసి సేవలు సేయుచుండ
నాశ్చర్య కరమగు నలరుల శయ్య
నిశ్చింత తోడుత నిదిరించువాని
వరబిలా కావృత వదనంబు మాడ్కి
మురువు ముక్తా సరమ్ముల నొప్పువాని
పది కూటముల నొప్పు పర్వతమనగ
పది మస్తకమ్ముల భాసిల్లువాని
దారి వాసించు గంధపు పూతవాని
తోరపు బంగారు దుప్పటివాని
రావణు గతిజితై రావణుఁ జూచి
పావని తలయూచి పలుమారు మెచ్చి
నీలమేఘము చెంత నిగనిగలాడు
మేలైన క్రొక్కారు మెరుపు చందమున
వాని కౌగిటిలోన వదలక పొదలి
మూని సుఖించు మండోదరి జూచి
యిది సీతయని నిశ్చయించి యోచించి
కొదమ సింహము రీతి కుప్పించిదాఁటి
తోక ముద్దిడుచును తొడరి కంభముల
పోకి వానర జాతి భావంబు జూపి
గరిమె నంతట వివేకము మదిబూని
సకలసగుణ వ్రాత జగదేకమాత
పావనావని జాత భామిని సీత
రావణు కోరునే రాముని బాసి
కానవి యిదిగాని ధరణిజగాదు

నేనా విధంబుల నా బుద్ధి భ్రమసె
నని నిశ్చయముజేసి యచ్చోటుబాసి
చని చని యటు పానశాలలు వెదకి
చనరాని యెడల నిచ్చలుబోయి నెమకి
వనితలు చెరలున్న వాడలు సరసి
యావలబోయి నీ పొ్రముతక్కోల
క్రోవి దారతమాల కురవకావకుళ
కనకదాడిమతాళ ఖర్జూర తరుల
నసమానమైన యుద్యానంబు గాంచి
యావనంబెల్లను నవనిజ వెదకి
యావల జని హేమ హర్మ్యంబు జూచి
యా మేడలోపల నంతయు వెదకి
భూమిజగానక బుద్ధి చింతించి
రాకేందు ముఖుఁడైన రామభూపాలుఁ
డేకాంతమున నన్నునెలమితో బిలిచి
నీవు నా బంటువు నీవు నా హితుఁడ
నీవు చూతువు సీత నెక్కెంబటంచు
నానవాలిచ్చిన నందినేవచ్చి
గాన నైతిని యిందు కమలాక్షి సీత
నెటువలెనే బోదునేమి జెప్పుదును
కటకటా వచ్చిన కార్యంబు దప్పె
తప్పిననేమాయె ధైర్యంబు బూని
యిప్పుడే వర్ణింతునెల్ల దేవతల
నింత నేజేసిన నెల్లగీర్వాణు
లంతట వచ్చితామతివ చెప్పింతు

రసి నిశ్చయము జేసి యా మేడనెక్కి
యనిల నందనుడుండె సమీపమున
తనపతి నెడబాసి తన మేనుబాసి
ఘన దుఃఖముల తేలి కడగండ్లదాసి
తనపాటు తలపోసి తగనలిరేసి
దనుజాంగనలగాసి ధైర్యంబుమాసి
యున్న యా భూపుత్రి సుత్పలనేత్రి
కన్నుల నీక్షించి కమలాక్షి సీత
కా బోలునని యెంచి కాకుస్థవరుల
కాబలారాతి ముఖ్యాళికి మ్రొక్కి
యా మేడ దిగివచ్చి యంగుష్ఠమాత్రుఁ
డై మారుతాత్మజుఁ డాశింశుపమున
గొనకొని పెనగొన్న కొమ్మల నడుమ
వనచరేంద్రుడు డాగి వలనోపనుండి
పరికించి పరికించి పవమానసుతుఁడు
మరల భావించి యా మగువనుజూచి
కడుపడి ఋష్యమూకముననుగన్న
తొడవులు నీయున్న తొడవులు నరసి
శ్రీరాముడానతిచ్చిన ప్రకారమున
నా రమణీమణియవయవ శ్రీలు
వరుసతోడుత పతివ్రతల చిహ్నములు
సరిలేని మానవ సతుల చిహ్నములు
కనిధాము పేర్కొని కాంత శోకింప
వనజాంగి భూపుత్రిగా నిశ్చయించి
మానవేశుఁడు నన్ను మన్నించి యొసగు

సానవాలునుగొని యాతని మున్న
నాడాడి వచ్చిన నా వంతమెల్ల
నేడు సార్థకమయ్యె నే ధన్యుండైతి
ఘోర రాక్షస వధూ కోటిలోనున్న
నీరజనేత్రిని నిత్య కల్యాణి
నెట్లునే సూరార్చునెట్లు భాషింతు
నెట్లు రాముని సేమమే వివరింతు
నని మారుతాత్మజుఁడాత్మ చింతింప
వనజాక్షి తలచి రావణుఁడు వేకువను
మనసిజాస్త్రవిపృష్ట మానసుండగుచు
కనక భూషణములు కనకాంబరములు
కనక కిరీటముల్ ఘనరుచుల్ నింప
దనరు బంగారు గంధపు పూతతోన
వలిపె దుప్పటిచుంగవలె వాటుతోన
పొలుపొందు పొడవైన భుజములతోన
కిన్నర గంధర్వ గీర్వాణ యక్ష
పన్నగా సురసిద్ధ భామలు గొలువ
కలయది చెంత దీపికలు ప్రకాశింప
వెలది మందోదరి వెంబడి నడువ
ననుపమంబగు చంద్రహాసంబు బూని
జనకజ ముందర చనుదెంచి నిలిచె
నంత రావణుగని యవనీతనూజ
యంతరంగంబున నదరిన భీతి
గురుతర వక్షోజ కుంభంబులాత్మ
బూరు హస్తంబులు నుదరంబు నంట

నాకుచీతము జేసి యనువెల్లబాసి
చీకాకు బడుచున్న సీతనుజూచి
కనకాంగి కుచముల కరములు నురము
తను మధ్యమేటికి దాచెదవిపుడు
చేకొని బలిమిని స్త్రీల బట్టుటయు
మాకుల ధర్మంబు మర్యాదనెంచి
నీమది రాకోరి నేనున్నవాడు
రాము డంబుధిదాటి రయమున వచ్చి
గొనిబోవునని నీవు కోరియున్నావు
నను గెల్వశక్యమే నగవైరికైన
తన తండ్రి పొమ్మన్న తాపసవృత్తి
వనముల దీనుడై వర్తించుచున్న
రాముని బొందియో రాజీవనేత్రి
యేమి భాగ్యంబుల నెనయ బొయ్యెదవు
నీమహి దివిజుల కెదిరింపరాని
నా ముందరను నిల్వ నరులెంతవారు
యీ లంక యార్థకయ్యేనకులుండేద
దాలింపు మీబుద్ధి జలజాక్షి నన్ను
పొంది భోగమ్ముల పొందుమటన్న
కుంది యీసీత చేకొని తృణంబునను
తన మది తృణముగా తలచి రావణుని
కనలుచు గద్గద కంఠియై బలికె
నాపతి వంచించి ననుదెచ్చినపుడె
నీపాలి మృత్యువు నేనిజము సుమి
బలహీనుడై రామభద్రుని నీవు

తలచక మును ఘోరదండ కాటవిని
యారసి ఖరదూషణాది రాక్షసుల
నీరుగా సేయఁడే నిమిషమాత్రమున
ప్రతిలేని రాముతో బవరంబు జేసి
బ్రతుకలేకను మీద బ్రతుక జూచినను
వేవేగ నను రామవిభుని కర్పించి
జీవముల్ నీవు రక్షించు కొమ్మనిన
దశముఖుఁడంత నుద్ధతిని కోపించి
శశిబింబముఖి జూచి చలమున బలికె
కైలాసమెత్తి దిక్పతుల నోడించి
కైలాసపతిచేత కైకొనివరము
లున్న నాముందర నొక హీనమనుజు
నెన్నెదవని రాఘవేశు నిందింప
వీనుల నామాటవిని తాళలేక
జానకి శోకించె జానకి జూచి
గరుడ పన్నగ యక్ష గంధర్వ సిద్ధ
సురకాంతలందరు శోకించిరంత
రావణు గర్వంబు రమణి శోకంబు
పావని భావించి పరితపింపుచును
లంకాధిపతిమీద లంఘింప తలచి
శంకించి పిమ్మట చతురుఁడై నిలిచి
యీ మహారాక్షసునే వధించినను
స్వామి జేసిన ప్రతిజ్ఞాభంగమగును
వీనిచే నేనొక్క విధమైతినేని
జానకి సేమంబు జననాథుతోన

తెలుపు నేవ్వండిది తెరగొప్పదనుచు
తలపోయుచుండె నా తరువున నంత
వనితలందరు విన వనజాక్షి సీత
తను దూలనాడిన దశముఖుండలిగి
చంద్రహాసము బూని చలమున రామ
చంద్రుని దేవిని సమయింపబోవ
నృదిరి గ్రక్కునను మండోదరి వచ్చి
కదిసి రాక్షసవిభు కరమొప్పఁబట్టి
కొమరైన యా బ్రహ్మకులమున బుట్టి
యమర వేదంబుల నన్నియు దెలిసి
కామాతురత్వంబు గైకొని యిట్లు
భూమిజ తెగటార్పఁబోవుట తగవె
యదిగాక నిది మానవాంగనదీని
కదియుట నీవంటి ఘనునికి తగదు
వలనొప్ప నీమీద వలచి వర్తించు
చెలులతో జూడ యీసీత యోపాటి
మనసిజు కేళిని మనసు రంజిల్ల
ననుబొందు నా ప్రాణనాథ రమ్మనిన
తనతోన లజ్జించి దశముఖుండపుడు
వినతనయోముఖి వికటహేమాస్య
హరిజట త్రిజటల నా మహోదరిని
నొరదిరమ్మని దయాశూనుఁడై బలికె
నదరు మాటలనైన ననునయంబులను
బెదిరించియైనను ప్రియములనైన
వలయు బాధలనైన వంచననైన

నెలతు కనిక రెండునెలలు నాసొమ్ము
జేసి తోడ్తెండటు సేయరాకున్న
నీసున మీరెల్ల నెలమితోగూడి
యీసీత తెగటార్చి యింతి మాంసముల
నాస దీరగ తినుండని యొప్పగించి
చింతా నిమగ్నుఁడై చివికి లంకేశుఁ
డంతఃపురంబున కరిగె నంతటను
దనుజ కామినులెల్ల దశముఖునాజ్ఞ
గొనకొని వెసజుట్టుకొని రాముసతిని
వెరపించునొక్కతె వెంటనే లేచి
పరగ శూలముబట్టి భర్జించు నొకతె
యిది బుద్ధిగాదని యెలయించు నొకతె
గదుము నొక్కతె కూడ గర్జించు నొకతె
వలదని వెంటనే వారించునొకతె
తలద్రుంచగను మ్రింగధట్టించు నొకతె
దనుజ నాయకుఁడగు దశకంఠుఁగూడి
యనుభవింపుము భోగమని జెప్పు నొకతె
కంటకలైన రాక్షస కాంతలిట్లు
దంటలై గారింప ధరణిజ బలికె
దనుజ కామినులార దయమాలి మీరు
ననుగాసిబెట్టుట న్యాయమే మీకు
పతిహీనుఁడైనను పతిదుష్టుఁడైన
పతి నిర్ధనుఁడైన పతి మూఁడుడైన
పతియె దైవంబుగా భావింపవలయు
పతిభక్తిగల పతివ్రతలకు కాఁగ

నా రామచంద్రుని నా మనోహరుని
ధీరుని కోదండ దీక్షా గురువును
జాతునే జీవముల్ బాతునుగాని
మీ తప్పు బోధన లింక మీకేల?
తిట్టిన తిట్టుండు దిట్టలై వచ్చి
కొట్టిన కొట్టుండు కొదవలు దీర
చెలఁగి మీరేమి జేసిన సేఁయుఁడనిన
కలుషించి రాక్షసకాంత లెంతయును
గారింప హారామ కరుణా సముద్ర
హా సుమిత్రాపుత్ర! హా రణశూర!
హా యత్త కౌసల్య! హా తండ్రి యనుచు
పాలుక భూమిజ విలపింపుచుండె
నంత నా త్రిజట సీతాంగన దుఃఖ
మింతఁ జూడగ లేక నెలమితో బోయి
నిదురించి కలగని నెరియ బిట్టులికి
వదలక వచ్చి యావనితల కనియె
కలగంటి నేను నిక్కముగ నీవేళ
తెలియజెప్పెద దాని తెరగొప్ప వినుఁడు
సామజంబున నెక్కి సౌమిత్రి గొలువ
రాముండు సీతతో రాజూడఁగంటి
శ్రీకరంబైనట్టి సింహాసనమున
కాకుత్స్థ విభుఁడుండగా కనుగొంటి
వదలక తన బంధువర్గంబుతోన
మదమెల్ల నుక్కి సామజముందుండ విడిచి
తైల సిక్తాంగుడై దశకంధరుండు

నేలపై యూరకే నిద్రింపఁగంటి
గురుతరోష్ట్రము నెక్కి కుంభకర్ణుండు
పఱగ కర్దమయమున పడియుండఁగంటి
వరుసతో నొక కపి కాలాగ్నితోన
దరికొని లంక దగ్ధముగాఁగఁగంటి
అరుదుగా ధర్మాతుఁడగు విభీషణుఁడు
సరసత దనుజ రాజ్యము సేయఁగంటి
రావణు మరణంబు రఘురాము జయము
భావింప సిద్ధంబు వదతి జానకిని
వలగొని బాధింపవలదు పొందనిన
కలఁగి యామాటకు కళవళలు బడుచు
దనుజ కామినులెల్ల దవ్వులకేగి
ననువొంద నిద్రించి రలసట దీరఁ
నంత రాక్షస కాంతలవ్వల చనఁగ
వంతల గాసిల్లి వనజాక్షి లేచి
ఆ రావణుండంత నాడిన కఠిన
దారుణాలాపముల్ తలచి భీతిల్లి
యాకొమ్మ ప్రాపుగా నా చెట్టుకొమ్మ
చేకొని తనలోన చింతింప దొడగె
యెక్కడ సాకేత మెక్కడ లంక
యిక్కడ నను విధియిటువలెదోసె
చలపట్టి దైత్యుచే సమయుదువనుచు
తలను లఖించెనో ధాతకాకున్న
రానేల రాఘుఁడరణ్య భూములకు
పూని మృగంబునకై పొమ్మననేల

కడగి నన్నసురుండిక్కడికి తేనేల
విడువక నన్నింత వెతబెట్టనేల
యీ జీవనమునకు నాకేల శోకింప
రాజీవనేత్రుండు రామచంద్రుండు
తాను తమ్ముని గూడి త్వరనేగుదెంచి
కాననంబున నన్ను గానక వెదకి
యెంత శోకించునో యెట్లున్నవాడో
అంతరంగమున నాకైయిందునెత్తి
యెన్నడు వచ్చునో యీ నీచుఁబట్టి
యెన్నడు దునుమునో యిది యెట్లుగూడు
నిట్టి కోరికలేల యీ నీచుచేత
గట్టిగా తనుహాని గాంచుట కంటె
యే విధంబైన మున్నే మేను బాసి
బోవుట మేలని బుద్ధిలో వగచి
తరలాక్షి దీర్ఘకుంతలముల సరుత
నురిబెట్టుకొని చననూహించునంత
సొరదియై తనమేన శుభసూచకములు
బరువడి దోప యప్పద్మాక్షిఁజూచి
మాని యాతెగువ నెమ్మదిని రాఘవుల
మానుగాఁదలఁచుచు మమత రెట్టింప
తనతల్లి దండ్రుల తన బాంధవులను
తన యత్తమామలఁదగబేరు కొనుచు
కనకాంగియుండ నొక్కతె వాయుజుండు
కని సమయంబిదిగా నిశ్చయించి
వనచర భాషలను వర్ణించియెల్ల

ష్ణునుజ భాషణముల మగువకిట్లనియె
జనని నీపతి రామచంద్రుడు తమ్ముడు
తన తమ్ముఁడగు సుమిత్రా పుత్రుతోన
మనసురంజిల్ల సేమమున నున్నాడు
వనచర సేనలవ్వారిగా గొలువ
వననిధిదాటి రావణు సంహరించి
నిను దోడుకొనిబోవు నిశ్చయంబనిన
యా మాట లాలించి యవనీ తనూజ
వేమారు దిక్కులు వీక్షించి బ్రమసి
పలుకక నా శింశుపావృక్షముననుఁ
తలయెత్తి జూడ పత్రముల మధ్యమున
కపి రూపమును జూచి కదిమి దద్దరిల్లి
విపరీతమిది యని విస్మయంబంది
సరగున యీ దుష్టశకున ఫలంబు
తరలి రావణునికి తాకుగాకిపుడె
మనుజ భాషలనాడు మర్కటంబుననుఁ
విననిది రాక్షస విభుమాయ యనుచు
తలవంచి యున్న యా ధరణిజ మనసు
తెలిసె మారుతిమాను దిగివచ్చి మ్రొక్కి
తల్లి నీ పతికినే తగిన సేవకుండ
కల్లగాదిది నీకు కలుగ విశ్వాస
మంగుళీయక మంపెనని జూపఁజూచి
యంగనామణి పొంగి హనుమంతు కనియె
దనుజ మాయల నేను తరచితిగాన
ఘనిముద్ర నమ్మిక కలగదు తనకు

నీపూరు నీపేరు నీకుల క్రమము
బావిరి దెలుపుము వరుసతో మున్ను
సాంద్రతేజో మహోజ్వలుఁడైన రామ
చంద్రుతో నీకెట్లు సఖ్యంబు గలిగె
సరసుఁడు రాముఁడే చందంబు వాఁడు
పరుగు సౌమిత్రి యేప్రాయంబువాఁడు
కాకుస్థుడిప్పుడెక్కడ నున్నవాఁడు
నీకు నేమని జెప్పి నిన్ను పుత్తెంచె
యేమాడ్కి వచ్చితి వీయబ్ధిదాటి
నామది రంజిల్ల నాతోన జెప్పు
మనవిని ముదమంది హనుమంతుడనియె
హనుమంతుఁడను వాడ ననిల సంతనుఁడ
సుగ్రీవు మంత్రినై సొరది వర్తింతు
నగ్రజుచే రాజ్యమతఁడు గోల్పోయి
ఘనమైన ఋష్యమూకమున సుగ్రీవుఁ
డెనసి మాతోనుండ నీపంక్తిముఖుఁడు
గొనకొని నిన్నెత్తుకొని పోవునపుడు
నిను జూచుచుంటిమి నీవును జూచి
పయ్యెద కొంగున బంధించి తొడవు
లయ్యెడవై చితివది దాచియుంటి
మచ్చట రఘురాముఁడరుదేరజూచి
మచ్చిక నేబోయి మనజేశు దెచ్చి
యిన తనూభవుని నినవంశజునికి
వినియోక్తి మైత్రి గావించితి నంత
నా తొడువులు దెచ్చి యర్కజుండీయ

ప్రీతి రాముఁడు తన పెంపు దీపింప
వాలిని వధియించి వాసరరాజ్య
మాలోన సుగ్రీవు కనుపొంద నిచ్చె
నిచ్చిన భృత్యుఁడై యిన తనూభవుఁడు
చెచ్చెర నీవున్న సీమ శోధింప
వనచరులను బంచె వరుసతో మమ్ము
దనరంగ ననిపెను దక్షిణంబరయ
రాముఁడప్పుడు నన్ను రయమున బిలిచి
యీ ముద్ర నాచేతికిచ్చి పొమ్మన్న
వలగొని కపులతో వచ్చి దేశముల
కలయ శోధింపుచు గానక మేము
శోకింప ననురుని సుతుఁడు సంపాతి
మాకు లంకాపురి మార్గంబు జూప
నంగదాదులను నే నయ్యెడ నిలిపి
సంగతిగా భీమ జలనిధి దాటి
పూని రేయెల్ల నీ పురమెల్ల వెదకి
గానక నిన్నిందు కనుగొంటిదేవి
యింతకు మున్ను లంకేఁడు వచ్చి
పంతంబుతో నిన్ను భంజింప జూచి
వాని చంపెదనని వడి నిశ్చయించి
నీనాథు సేమంబు నీతోన జెప్పి
నిందు వేడుకలోన నేబోవు వేళ
చండ రాక్షసుబట్టి సమయింతు ననుచు
సుండితిగాని నేను సురాశించి (గాదు)
యుండలేధిద్ధి నిక్కమూహింపుమనుచు

రాముని రూపంబు రాము శౌర్యంబు
రామునియెడ గల్గు రాజ చిహ్నములు
సౌమిత్రి చందంబు సకలంబు జెప్పి
వేమారు వినుతించి వినయంబుతోన
జనక పుత్రిక భక్తి సాష్టాంగ మెరగి
హనుమంతుఁడంగుళీయక మిచ్చెసంత
వనితె గైకొని నేడు వచ్చి ప్రాణంబు
లనుచు రామునిచూచి నట్లానవాలు
కనుగొని మూర్ఛిల్లి గక్కున దెలిసి
హనుమంతుఁజూచి యిట్లనియె మోదమున
వానరాధిప నీవు వచ్చి నా ప్రాణ
దానంబు జేసితి తగునట్టి నీకు
నుపకృతిగాన నీవుర్విని రాము
కృపను వర్ధిల్లుము కీర్తితోనవిన
పవనజుండానంద భరితుఁడై పొంగి
సవినయంబున మ్రొక్కి జనకజఁజూచి
యా దేవతలకైన నందంగరాని
నీదయ బడసితి నే ధన్యుండనైతి
రావణు వధియించి రామచంద్రుండు
దేవినిన్ గొనిపోవు దిగులేల నింక
తడవని తలచితే తల్లి నిన్నిప్పు
డిడుకొని భుజముల నినవంశుజేర్తు
నరుణోదయంబున కనసంతసిల్లి
ధరణిజ పవమాన తనయున కనియె
నీవంతవాఁడవు నృపునాజ్ఞలేక

వావిరి గొనిపోవ వచ్చునే నన్ను
నీవు గొబ్బునబోయి నెమ్మి నా పతికి
నా విధంబెల్లను నయమున దెల్పు
నా బాధ దయగల్గి నా మరిదైన
సౌమిత్రితోన నా చందంబు దెలుపు
సూర్యపుత్రుండైన సుగ్రీవుతోన
కార్యంబు సఫలంబు గావింపుమనుము
పొమ్ము నీవటు వేగబోయి రాఘవుని
దెమ్మన్న మారుతి ధీరుఁడై బలికె
దేవి నీ విభుడానతిచ్చిన దెల్ల
నీ విభునకుబోయి నే విన్నవింతు
ననువొంద నీకిచ్చి యంగుళీయకము
తనరనే రిక్తహస్తములతోఁబోవ
తగదు నా కిదిదూత ధర్మంబుగాదు
మగువ నీ మస్తక మణి యిమ్మటన్న
పలికె భూపుత్రియో పవమాన తనయ
పలుమారు నీరూపు పరికించిగాని
యీ మణి నీచేతి కియ్యనేననిన
యా మారుతాత్మజుఁ డచలుఁడై పెరిగి
వినువీధినంటి త్రివిక్రముండనగ
కనబడకని సీత కడు సంతసిల్లి
తన రత్నమీయ నాతఁడు గొనిమ్రొక్కి
జనకజ వీడ్కొని జద బలోద్ధతిని
వన మహీరుహముల వడిగూల్చి యార్చి
వనపాలకులనెల్ల వధియించినైన

కావలియున్న రాక్షసకాంతల దరి
రావణుతో జెప్ప రావణుండలిగి
వీరుల నెనుబదివేల రాక్షసుల
పోరికి ననుపనప్పుడు వారు వెడలి
రంత సూర్యోదయంబగుటయు జూచి
పంతంబు తోడుత పవన నందనుఁడు
ప్రకటించి కాంచన పర్వతాకృతిని
మకర తోరణముపై మలయుచునుండి
తనుదాకి నొప్పించు దనుజ వీరులను
గని కోపమడరంగ గర్జించి పలికె
వోరి రాక్షసులార యుర్విపై నేను
శూరత విలసిల్లు సుగ్రీవుబంట
శ్రీరాము దూతనే శూలిని వాయుజుఁడ
శ్రీరాము సేమంబు సీతతో జెప్పి
పోవుచున్నాడ నీపురి రాక్షసులకు
వావిరి మృత్యువై వచ్చియున్నాడ
ననిబల్కి దైత్యుల నందరిని గూల్చి
దనరుచు తోరణ స్తంభంబు నుండె
హత శేషముఖమున నావార్త దెలిసి
ధృతిఁబూని కోపించి దేవతారాతి
గురి గొని పింగళాక్షుని దీర్ఘ జిహ్వు
వర వక్రనాసాక్ష పక్షశార్దూల
ముఖుల నేవురఁబంపమొనసి వారవ్వ
ఢభిలాస్త్రముల నొంప హనుమంతుఁడలిగి
ధనువులు విరిచి శేతనములు కూల్చి

పనువడి రథములు భగ్నంబు జేసి
కనలుచుఁబట్టి రాక్షస పంచకమును
ననిలోన తెగటార్చి యసమానుఁడగుచు
సరగున తోరణ స్తంభంబు నెక్కి
గరిమె సంగర కేళి కాంక్షింపుచుండె
నత్తరి లంకేశుడా సుద్దిదెలిసి
మత్తుడై యా జంబుమాలిని బంప
వాడు శతాంగంబు వలనొప్ప నెక్కి
పోడిమి బలములు పొరలి యేతేర
వచ్చియా హనుమంతు వలనొప్పదాకి
చెచ్చెర నొప్పింప నిశిత శరంబులను
కాలదండము మాడ్కి కడువడినుండు
వాలదండము బూని వాయునందనుఁడు
బలములనెల్లను బరిమార్చి పేర్చి
యలిగి రాక్షసుని శతాంగంబుల గూల్ప
విరథుఁడై రాక్షస వీరుండు కనలి
కరవాలమొక్కటి కరమున బూని
పవమాన తనయుని ఫాలంబునేయ
యవశుఁడై మూర్ఛిల్లి యంతలో దెలిసి
యలిగి కైదువబూని యలజంబుమాలి
తల తెగవేసిన ధరణిపై బడియె
హత శేషులతని పాటంతయు జెప్ప
నతి కోపమున దశాన నుండపుడు
జితరిపు విక్రమోద్ధిత సప్తమంత్రి
సుతుల బాసటగాంగ సొరదియ్యజేసి

నమిత బలోదారు నమర విదారు
నమరాద్రి సమధీరు నక్షకుమారు
బిలిచి నీవటుబోయి బీదవానరుని
తలగొట్టి తోరణ స్తంభంబునందు
గట్టి రమ్మన్నవాడు గ్రక్కున మొక్కి
ధట్టించి మంత్రినందనులతో ముద్దు
పాటించి ఘోటక ప్రకరసంభరిత
కోటి సూర్య ప్రభాంకుర రూపరత్న
హాటక స్థగిత శతాంగంబు నెక్కి
మేటి విల్లెక్కిడి మీటుచు వచ్చి
కంఠీరవంబును గంధసింధురము
కుంఠిత గతిని మార్కొన్న చందమున
ననిల నందను తాకి యమిత బాణములు
పనువడి నేయనా పవమానసుతుఁడు
వాల దండంబున వారించి దాని
తాల వృక్షంబునుద్ధతి చేత బూని
వాని కేతనములు వాని సారథిని
వాని గుఱ్ఱములను వాని రథంబు
మొనసి నేలను గ్రుంక మొత్తియార్చినను
కనలి యక్షుఁడు లయకాలుని మాడ్కి
పది బాణముల కపిపాలంబు నేయ
నపరి మూర్ఛిలి యంతదంతలో దెలిసి
యక్షుని నిజవాల హతిని నొప్పింప
యక్షుఁడు గదగొని యనిలజాననపై
నదటిన వివశుఁడై యంతలోఁ దెలిసి

యప్పుడు గదగొని యనిలజుండేయ
దప్పించుకొని వియత్తలమున కెగయ
విడువక మారుతి వెంబడి నెగసి
తడయక వాని పాదములూడ్చి పట్టి
పిడుగుతో సరియైన పిడికిట బొడిచి
జిరజిర త్రిప్పి యాక్షితినివై వగను
పరగ నక్షుడు నేలపడికూలె నంత
విజయలక్ష్మి సమన్వితుడై కపీశు
డజితుఁడై రణకేళియాసక్తినుండె
బెదరి యప్పుడు హత శేషులు పారి
పది ముఖంబుల పరికించి మ్రొక్కి
దేవ వానరుఁడని దృష్టింపరాదు
భావింప సలవీర భద్రుండుగాని
వనమెల్ల పొరిగొనె వాల దండమున
వనపాలకుల నెల్ల వసుధపై కూల్చె
నరయ శార్దూల ముఖ్యాది రాక్షసుల
పరిమార్చి యక్షుని భర్జించి వైచె
నానగ చరుగెల్వ నమరులకైన
దానవాధీశ్వర తరముగా దనిన
వెరగంది రాక్షస విభుఁడక్షు తలచి
పరితపింపగ జూచి పాకారివైరి
దేవనీకింత చింతింప నేమిటికి
నా వానరాధము నవలీల బట్టి
తెగటార్తు లేకున్న దెట్టునే ననుచు
తగ తండ్రికిని మ్రొక్కి తన రథంబెక్కి

యసీలజు పైరాగ నా యింద్ర జిత్తు
వనధులు కలఁగె భూవలయంబు వదరె
నప్పుడా యింద్రజిత్తనిలజుమీద
తప్పక శరవర్ష ధారలు గురిసె
గురిసిన కపివీర కుంజరుండలిగి
తరులను గిరులనాతని మీదవైచి
తొడరివాని రథంబు తోకను జుట్టి
యడచె భోరున దైత్యులడుగంటిమడయ
ననిలోన నవిరథుడై యా యింద్రజిత్తు
హనుమంతుపైని వాయువ్యాస్త్రమేసె
ననిల పుత్రుఁడు గానవా యస్త్రమునకు
మునుకొని నిల్చెనిమ్ముల ధీరుఁడగుచు
దానవుండపుడు రౌద్రాస్త్రంబునేయ
నానక కొని నిల్చె రుద్రాంశంబు గనక
హనుమంతు బలిమికి నచ్చెరువంది
తనమది కోపించి తగయింద్రజిత్తు
సురులు భీతిలవాయు సూనుని మీద
పర భయంకరమైన బ్రహ్మాస్త్రమేసె
ననుపమ బ్రహ్మాస్త్ర మరుదేరఁ జూచి
తనమది బ్రహ్మమంత్రములుచ్చరింప
నది చంపజాలక నతని బంధించి
కుదియించి పడవైచె కుంభిని మీద
కనియింద్రజిత్తు రాక్షసులచే నతని
పెను రజ్జువులఁగొని బిగియ గట్టించి

హనుమంతు దెచ్చి లంకాధిపు నెదుట
దసర నుంచిన తన తనయుని మెచ్చి
తన శౌర్యమటు జూప తలచుచునున్న
హనుమంతుఁ జూచి యిట్లనియె రావణుఁడు
వోరి వానర వినవోరి నీవెవ్వ
డే రాజు సేవకుండేది నీ పేరు
ఛీలమై నిర్జరాభేద్యమౌ లంక
కేలాగు వచ్చితి వెరిగింపుమనుడు
వానరాధిపుడంత వడితృణంబుగను
దానవేశ్వరుజూచి దర్పించి పలికె
వినరోరి రావణ విశ్వంబులోన
నినుతోక గట్టి మున్నీటిలో ముంచి
యనుపమ బలశాలియైన యావాలి
దునిమి భానుజునికి దొరతనంబిచ్చి
దంటయై కీర్తులఁదనరు శ్రీరామ
బంటము వాయుజుండ నేభానుజామంత్రి
హనుమంతుడనువాడ నా రాముఁడనుప
దిన కరకులుని ముద్రిక గొంచు వేగ
వచ్చినీరధిదాటి వడిని నీ లంక
జొచ్చి భూపుత్రిని జూచి యుంగరము
నిచ్చి జానకి రత్నమిచ్చిన గొనుచు
వెచ్చెర బలిమియై చెలఁగి నాలావు
నీకు చూపదలచి నీవనంబెల్ల
చీకాకు జేసి శిక్షించి రాక్షసుల
దడయక నిను జూడ తాకట్టువడితి

పిడివడినే బోయి విన్నవించినను
వనచరులను గూడి వననిధి దాటి
నిను వధించును రామనృపుఁడు నీవిపుడు
మన దలచితివేని మనుజేశ్వరునికి
జనక పుత్రికనిచ్చి శరణంబు గొనుము
నావుండు రాక్షస నాథుండు కసలి
యా వీరవరుని ప్రహస్తుని జూచి
కుదురుగా నుండి యీ కోతియేమేమో
వదరు చున్నది దీని వధియింపు మనుచు
నా విభీషణుడు లంకాధిపు జూచి
దేవదూతలను వధించుట తగునె
మగుడ కోపము నీకు మనసున నుండ
తగిన దండన కొంత దండించిపంపు
మన రావణుఁడు రాక్షసావళిఁబిలిచి
కినుక నీ మర్కటు గేరవాలంబు
విరివిగా గాలిచి వీధుల ద్రిప్పి
తరలగ మనమెట్టు దాటింపుడనిన
దానవులంతను తాళ్లదెచ్చి
వానరాధీశుని వదలక కట్టి
తరుచుగా మును వేళ తాళముల్ మ్రోయ
విరసంబులాడుచు వీధులఁ ద్రిప్పి
వేలారు కోకలు వెంటనే దెచ్చి
తైల ధారలుబోసి తగవాయు సుతుని
వాలంబునను జుట్టి వడిచిచ్చు వెట్టి
దోలిరి యంత వాతూలనందనుని



దనుజ కాంతలు జెప్ప ధరణిజ దెలుప
దనకరంబున నీట దయను స్పృశించి
సదయ రాముఁడు సత్యసంధుడౌ నేని
వదలకనే పతివ్రతనౌదునేని
హుతవహా: దయను నీవాగివాయుతనయు
నతి శీతలుండవై నాడు కొమ్మనిన
హనుమంతు నీకప్పడతివ దీవనల
ననలుండు కడుచల్లనై యుండెనంత
వావిరి యా బ్రహ్మవరమున జేసి
పావని కాయస్త్రబంధమ్ములూడ
కాలాగ్నిరుద్రుని కరణివాయుజుఁడు
వాలాగ్నిఁజూచి దుర్వారుఁడై పేర్చి
కలయనీలంక దగ్ధము సేతుననుచు
తలవనర్కుఁడు గ్రుంకె తరుచకుడపుడు
తనవాలమెత్తి యత్తరి లంకలోన
కినుక బుట్టిన ధూమకేతు వోయనగ
వడి వాయుజుండు రావణు హజారమున
తడయక నెక్కి ముందరచిచ్చుబెట్టి
హాలాయముగ దైత్యువరుల గేహములు
లీలమై చేర్చి కాలిచి గంపకెత్తి
భీమాగ్ని కీలలాభీల ధూమంబు
లామహా బిలమున నందంద గప్పి
యపుడు హనుమంతుడా లంకయెల్ల
తప్పక శోధించి దగ్ధంబు జేసి
తన మది చింతించి ధరణీ తనూజ

యనలోగ్ర శిఖల నేమాయ నోయనుచు
యసుర ప్రతాపాగ్ని నార్పుచందమున
వెసవాల వహ్నిని పిషధిలో నార్పి
జనకజ కడకేగి సద్భక్తి మ్రొక్కి
తనదు వృత్తాంత మంతయు విన్నవించి
యా సీత దీవింపనందుంతి మగుడి
యాసువేలాద్రిపై యనువొంద నెక్కి
యనిల వేగంబున నంబుధి దాటి
వనచరులకు శుభవార్తలు దెల్ప
వనచరులుప్పొంగి యా వాయుజు పొగడి
తియ్యని ఫలముల తృప్తిగావించి
నయ్యెడవసియించి యా రాత్రి గడిపి
మరునాడు కపులెల్ల మధువనంబునకు
తరలి యా మధువనాంతరమున జొచ్చి
ఫలముల మధువుల బహు తృప్తిబొంది
తొలగక తరుల గంతులువేయ జూచి
మొరసి దిట్టుచు దధిముఖుదేగుదేర
మరలి వానికి దేవ మార్గంబు జూపి
పిడుగుతో సరియైన పిడికిళ్ళవాని
బొడిచి టోద్రోలిన బోయి వాతప్పు
డిన సుతునికిఁ దెల్ప నినజుండు మిగుల
కసలిన జూచి లక్ష్మణుఁడిట్టులనియె
వావిరి కపులు నీవని జొచ్చినపుడె
దేవి సేమము వారు దెచ్చియుండుదురు
పిలిపింపుమన నివి ప్రియము రెట్టింప

పిలిపించెవారి సంప్రీతి నర్కాజుఁడు
వనచరోత్తములు దుర్వార విక్రములు
వినయంబు భక్తి వివేకమ్ము దనర
రామ లక్ష్మణులకు రంజిల్ల మ్రొక్కి
యా మీద నిసజాని యడుగుల కెరగి
వారలు హనుమంతు వలనొప్ప దెచ్చి
శ్రీరామ చంద్రుని చేరువ నిలువ
మనువంశ తిలకుని మనసు గుర్తెరిగి
హనుమంతుడెరగి యిట్లనె రాముఁజూచి
కంటి సీతను వాలు గంటిని రామ
కంటినీ పదము రాగంటి నీ కృపను
దేవనేనీ కృపా దృష్టిచే బోయి
యా వననిధి దాటి యా లంకజొచ్చి
యవనిజ పొడగాంచి యానవాలిచ్చి
యవనిజచే రత్నమంతనే బడసి
నా చేతనైనట్టి నరనాధ కొంత
రాచ కార్యము జేసి రహివచ్చినాడ
ననిరత్నమిచ్చిన నతడు చేబూని
కనుల నొత్తుకొని యా కపివరు కనియె
పావన చరిత యోపవమాన తనయ
నీవంటి బంటునే నెందును గాన
యెలమి నీతో సీతయేమని జెప్పె
తెలుపవేయని విని దేవనీదేవి
వొంటిపై కడగండ్లకోర్చి శోకమున
కంటనశ్రువులిడ కాల్వలై దొరగ

చెక్కిట చేయిజేర్చి చిత్తంబు మిగుల
నెక్కొన్న భక్తిచే నీ యందు నిలిపి
నుడుగని వగలతో నొక మానుకింద
తడబడి యున్నది ధరణీ తనూజ
తానిందువచ్చుచో తగకొన్న మాట
లానాటి దెల్పెనే నవి విన్నవింతు
నను చెట్టబట్టి మిన్నక కాననమున
దనుజుని కొప్పింప తగవుగాదనుచు
వినిపింపుమనె దేవి వినుము శ్రీరామ
తనతండ్రి రాముఁడు ధర్మజుఁడనుచు
నను దారఁబోసెను నమ్మికతోన
కడపట నన్నొంటిగా లంకలోన
విడుచుట యిది నీకు వీర ధర్మంబె
తనవున జీవముల్ తనకింక నిల్వ
వని జెప్పుమనెనని యన్నియు జెప్పి
సౌమిత్రికిని యల జలజాప్తసుతుని
కామె జెప్పిన మాటలనువొందఁజెప్పె
జెప్పిన కపివీర సింహంబు లెల్ల
నప్పుడానందించి రాత్మ నుప్పొంగి
యని భోసలాబ్ధి సుధాంశుఁడుత్తముఁడు
ధననాథతుల్యుఁడు దార విక్రముఁడు
సరససాహిత్య లక్షణ చక్రవర్తి
కరుణా సముద్రుండు కవి కల్పకంబు
విలసిల్లు తుళజ భూవిభుకుమారకుఁడు
పొలుపొందు యేకోజి భూమి పాలకుఁడు

తన తండ్రి తులజేంద్ర ధరణీశు పేర
జెనుపొంద మకరంద బిరుదాంకు పేర
రమణీయమైన యీ రామాయణమున
కమనీయ సుందర కాండంబు జెప్పె
నిది తుళజేంద్రుల కిడునెప్పుడిలను
పౌదలు సంపదలును పూర్ణశక్తులును
సకల దీర్ఘాయుష్య సంతానములను
సకల రాజ్యంబుల సకల భోగముల
సమర జయంబుల సకల కీర్తు
లమరంగ నొసగు మహారామ చరిత
మిదిమహాపుణ్యదమిది వేదసార
మిదిముక్తి సోపానమిది శుభోదర్క
మివ్వసుంధర శక్తినెలమితో దీని
నెవ్వరు చదివిన నెవ్వరు వినిన
నెవరు వ్రాయించిన నెవరు వ్రాసినను
భువిలోన వారికి పుత్ర సంపదలు
ఘనమైన కీర్తులు కరితురంగములు
మనసురంజిలజేయు మాని నీ మణులు
పరగ దీర్ఘాయుష్య భాగ్యంబు లొసగు
ధరణిలో నా చంద్రతారార్కముగను

—: శ్రీరామ చంద్రాయనమః :—

# యుద్ధ కాండము

శ్రీరఘు వీరుండాశ్రిత ప్రాప్తజాతుం
డారూఢిగను సమీరాత్మజు చేత
జనక సేమంబు సకలంబు దెలిసి
మనసు రంజిల హనుమంతు దీవించి
ఆలింగనము జేసి యతనిచే నప్పు
డాలంక చొప్పెల్ల నాను పూర్విగను
విని తన మదిలోన విస్మయంబంది
దిననాథ సుతుజూచి తెరగొప్పనీవు
విశదంబుగా నేడు విజయలగ్నమున
దశముఖుపై దండు తరలింపుమనిన
సుగ్రీవు ననుమతి సొరది వానరులు
నిగ్రహానుగ్రహ నిధిరాము కెరిగి
నిరుపమా కృతిగల నీలు వెంబడిని
పరగ నార్చుచు తమ పాదఘట్టనల
ధర పెల్లగిల్ల దిక్కూటములు దుల్ల
శరదులు కలంగ నిర్జరులుల్లసిల్ల
తడయక సింహనాదములు సేయుచును
నడచిరసంఖ్యాలై నానాముఖముల
హనుమంతుపై రాముండగదు మీద
ఘన పరాక్రముఁడు లక్ష్మణుఁడేగుదేర

వనచర భటులు కైవారముల్ సేయ
వనజాప్త సుతుండు కేవల భక్తినరుగ
మలయ సంహ్యాఁదుల మలక జూచుచును
వెలువడి వనచర వీరులతోన
కడలిని జూచి యక్కడ రాఘవుండు
విడియించె పాళ్యంబు వేడ్కతోనంత
రాముఁడేకతమున రవిజుని జూచి
యీ మహాంబుధి కపులే విధంబునను
దాటుదురిందుకు తగునుపాయంబు
పాటించి వేగ నేర్పరచు మటన్న
నాలోన రవి పశ్చిమాంబుధి గ్రుంకె
భూలోకమెల్లను పొదలె చీకటులు
వెలయు రాముని కీర్తి విలసిల్లు మాడ్కి
మలసి తూర్పున చందమామ చూపట్టె
నంత సూర్యోదయంబైన రాఘవుఁడు
సంతసంబున లేచి సౌమిత్రితోన
తడయక సాంధ్యకృత్యములను దీర్చి
కడలింతల సన్నికను గొనుచుండె
రావణుండక్కడ రాక్షసాధిపుల
రావించి యాకోతి రాయడి మీరు
కంటిరి గదుదుష్ట కపివేగబోయి
వెంటనే యా రామ విభుదెచ్చెనేని
శౌర్యంబు తప్పును గావున తగిన
కార్యమూహించి చక్కగ జెప్పుడపుడు
వినిమంత్రులాదైత్య విభుకిట్టులనిరి

దనుజేశ నీకింత దైన్యమేమిటికి
శరమూర్తి నెత్తవా కైలాసగిరిని
సురుల శోధింప వాశూరుడై నీవు
నీముందరను దా నిల్వనేర్చునేరాము
డామర్త్యు వధియింప నల్పుండు చాలు
ననిబల్కు మంత్రుల నందరి జూచి
పెనగొన కినుకవిభీషణుండనియె
కారులాడెదరు పై కార్యమెంచకను
మీరొక్క మంత్రులే మీరొక్క ఘనులే
పెరలెత్తకను సామభేదదానముల
సొరది శాత్రవుడు వశ్యుండు గాకయున్న
నామీద దండంబు నమరు మీరెట్లు
నేమైన యత్నంబు లేచి జేసితిరే
రామభద్రుని పరాక్రమ గుణంబులను
హేమగర్భునికైన నెంచంగ తరమె
మనుజ మాత్రుండని మదినెంచవలదు
దనుజాంతకుడు సుమ్మి దశరథాత్మజుడు
కనలేడా నిన్న రాఘవుదూత శౌర్య
మనిజెప్పివిని యా త్రినన్న కిట్లనియె
వినురాక్షసేశ్వర విక్రమోదార
చనటి మంత్రులమాట చెవిబెట్టవలదు
దేవిని లంకకు దెచ్చిన మొదలు
దేవ యీ పురలక్ష్మి దీనయై పొలిచె
తోచుచున్నది మహా దుర్నిమిత్తంబు
లే చందమున జూడనిది బుద్ధిగాదు

జనకజ గొంపోయి సరగున రామ
జనపాలమణికిచ్చి శరణంబు వేఁడుము
నీవంశ గరిమెను నీ జీవములను
నీవారినెల్లను నీవు రక్షింపు
మని చిలుకకు జెప్పి ముమ్మారు
చనబుద్ధి యా విభీషణుఁడు చెప్పినను
విని రావణుఁడు కోప వివశుఁడై జూచి
తన తమ్ముఁడనకను తన్నె తన్నుటయు
నా విభీషణుఁడు శోకాక్రాంతుడగుచు
వేవేగ రాక్షస విభునికి మ్రొక్కి
రావణా విను నీవు రాముబాణాగ్ని
కావరంబున గంగ గ్రాఁగెదు నాడు
తలచుము నా బుద్ధి తలఁపున నన్ను
తలఁచు మటంచును తరలయా క్షణమె
తన మంత్రివరులతో తగ విభీషణుఁడు
వినువీధిరాఁగ భావించి వానరులు
సమరసన్నద్ధులై చనుదేర జూచి
సముచితంబుగ విభీషణుండిట్టులనియె
రావణానుజుఁడనే రహి విభీషణుఁడ
వేవేగ శ్రీరామ విభునికి సీత
నిమ్మన్న దశకంఠుండెలమి కోపించి
పొమ్మన్న వచ్చితి భూనాథకడకు
మాతకుండనుగాను కపటినిగాను
భీతుఁడై వచ్చి విభీషణుండనుచు
శరణాగత త్రాణత సిద్ధాత్ముతోన

కరుణించి తెలుపుఁడీ కపులార యనుచు
నామాట సుగ్రీవుండాలించి వేగ
రామునితో దెల్ప రఘురాముఁ డనియె
నా విభీషణుండైన యర్కజ వినుము
రావణుఁడైన గర్వము దక్కివచ్చి
శరణన్న రక్షింతు సంశయంబెల్ల
ధర నివి క్షత్రియ ధర్మంబు సుమ్మి
యభయ మిచ్చితి నొందు నాత్మ నెంచకుమి
నభయ చిత్తుని విభీషణు తెమ్మటన్న
విని భాను తనయుఁడు విస్మయంబంది
చని కూర్మితో విభీషణు తోడితెచ్చి
ప్రేమతో శ్రీరాము భేటి సేయింప
నా మహాత్ముడు రాము కతిభక్తి మ్రొక్కి
పరమాత్మ శ్రీవత్స పద్మపత్రాక్ష
కరుణించి నను ప్రేమగావవే రామ
శరణాగత త్రాణ చాప ప్రవీణ
కరుణించి నను ప్రేమకావవే రామ
చిరకీర్తిలోల కౌశిక యాజ్ఞపాల
కరుణించినను ప్రేమకావవే రామ
హరి యహల్యా ప్రకాహర జగద్రూప
కరుణించినను బ్రోచి కావవేరామ
హరచాప భంగ మోహన సుందరాంగి
కరుణించి నను ప్రేమ కావవేరామ
ధరణీ సుతాధీశ తపన సంకాశ
కరుణించి నను ప్రేమ కావవేరామ

పరశురామా ఓల పావనశీల
కరుణించి నను ప్రేమ కావవేరామ
ఖరదూషణాది రాక్షస సంవిదార
కరుణించి నను ప్రేమ కావవేరామ
వర సద్గుణోదార వాలి సంహార
కరుణించి నను ప్రేమ కావవేరామ
యని సన్నుతులు సేయు నా విభీషణుని
తన దయాదృష్టిచే తనియంగజేసి
దనుజేశునికి నీవు తమ్ముడుగావు
తనకు తమ్ముడు నీవు తథ్యమ్ముసుమ్మీ
యని చెప్పి యతనిచే మరి మర్మమెల్ల
పనువడిగా రామభద్రుండు దెలిసి
యా విభీషణునికి నద్ది తీరమున
ఖావించి లంకకు పట్టంబుగట్టి
కడలిని ప్రార్థించి గర్వించిమించు
కడలిని శరముల గావించి పిదప
జాతిగా నలునిచే బహుశుభప్రకర
హితువశర్వించు నింద్రాది ధూమ
కేతువ గీర్వాణ కీర్తిత పుణ్య
సేతువ గట్టి పవిత్ర వైఖరిని
జూచు వానరులు మెచ్చుచు మస్తకముల
నుంచు వానరులు నైయ్యుదధితో దుముకి
యుందు వానరులెత్తి యలమి జంతువుల
యుందు వానరులు నిమ్ముల సేతు వీథి
బాడు వానరులును బట్టు వానరులు

సై రాము ముందరనాడు చూంతగను
శ్రీరాముఁడన శ్రీ చెలువుగ చర సేనలు గొల్వ
తోరమైనట్టి సేతువ మీదబోయి
యదరక యీసువెర్రి చంగటను
విడియించి పాళ్యంబు వేడ్క నందుండె
చారులచే రాము జననాథురాక
యా రావణుఁడు విని యాత్మ భీతిల్లి
శుకసారణుల పంప సౌరదియైవారు
సకల వానరవీర సైన్యంబు జూచి
వచ్చి జెప్పినను రావణుండాత్మలోన
నచ్చెరువొంది మహాసౌధ మప్పు
డెక్కి వానరసైన్యమీక్షించి బెదరి
సుక్కి యాసారణ శుకుల కిట్లనియె
నివ్వేటిల్లెడి కపి నివహంబులోన
నెవ్వండు సేనాని యెవ్వడు శూరు
డెవ్వడు రాముని కిష్టుడైయుండు
నెవ్వని ప్రాపున నీసేన నడుచు
నెవ్వడు లక్ష్మణుండు రాము
డెవ్వడు సుగ్రీవు డెవ్వడంగదుండు
మీరు నెర్వెర నెమ్మిగ దెల్పుఁడనిన
సారణుండపుడు రాక్షసనాథు కనియె
గురుతర కపినాయకుల తల్లక్షగొల్వ
తరుచర సేనముందర నున్నవాఁడు
వీరము దుర్జయుఁడల్ల పావకసుతుఁడు
పరసైన్య నాథుఁడు వాఁడు నీలుండు

గిరిమేతో శతబృంద కపులు సేవింప
చురుకుచూపుల లంక చూచుచున్నాడు
వాలికంటెను దుర్వార విక్రముడు
వాలి నందనుండుల్ల కాడంగదుండు
ఘన బలాఢ్యుడు విశ్వకర్మ నందనుఁడు
పనుపడి సేతువు బంధించినాఁడు
నగచర శతకోటి నాథుడైనాఁడు
నగధైర్యుఁడాతండు నలుడు లంకేశ
పరమేష్ఠి తనయుండు భల్లూక విభుఁడు
వరసనాతడు జాంబవంతుడు దేవ
వాఁడు గవాక్షుండు వాఁడు గజుండు
వాఁడుపో ద్వివిధుండు వాఁడుమైదుండు
వాఁడెపో శతవలి వాఁడె సంపాతి
వాఁడె ధూమ్రాఖుడు జాంబవంతు తమ్ముండు
వాడింద్ర జాలుండు వాఁడెపోహరుఁడు
వాఁడెపోక్రథనుండు వాఁడు తారుండు
వాఁడు కేసరియల్ల వాఁడె సుముఖుఁడు
వాఁడు సుషేణుండు వాఁడు విముఖుఁడు
జలనిధి లంఘించి జానకి గాంచి
కొలుచు లంకాపురి పొరిగొన్న శూరు
డా వాయు తనయుండు హనుమంతుడితడు
నీవు నెరుంగుడు నిర్జరారాతి
కామరూపులు భీమఘన తర శౌర్య
లీమంద కపిబలులెన్నంగ తరమె
అని సారణుఁడు దెల్ప నా శుకుడదనియె

వినుదేవ రఘురాము విక్రమ స్ఫురణ
సిలమెచ్చము పోలు నెమ్మేని వాఁడు
శూలిపోలికె జటజూటంబు వాఁడు
నిండు చందురువంటి నెమ్మోమువాఁడు
పుండరీకాక్షుండద్భుత పరాక్రముడు
కరుణా సముద్రుండు కమలా ప్రకులుఁడు
పరశరణాగత వజ్రపంజరుండు
భూమిజాక్షి చకోర పూర్ణచంద్రుండు
రామాభిరాముఁడు రాముఁడా ఘనుఁడు
ఆ రాము చేరువ సతిభక్తి నిలిచి
వీరుఁడై శరములు విల్లు చేబూని
వేమారులంక భావింపుచున్నాడు
సౌమిత్రి యాతడు స్వర్ణవర్ణుండు
గట్టిగా రఘురాము కారుణ్యరాము
పట్టాభిషిక్తుఁడై పరఁగుచున్నాఁడు
మనుజేశ్వరునికి నీ మర్మముల్ జెప్పి
చనువున మను విభీషణుండాతండధిప
ఆ రాముతోన మంత్రాలోచనముల
కోరి సేయుచు చెంత కూర్చున్నవాఁడు
వన చర ధీశుండు వాలి సోదరుఁడు
ఘన హేమమాలి కాకలితుఁడా రాముండు
యా రామచంద్రుని చేరి యా కిష్కింధ చేకొన్నవాఁడు
శూరత విలసిల్లు సుగ్రీవుడతఁడు
యూతని సైన్యంబు లెన్నంగ తరమె
ధాతకునైనను దనుజాధినాధ

యని విని వారుల ననిచి లంకేశుఁ
డాసరంగ నొంటి విద్యుజ్జిహ్వు బిలిచి
రామాభి ధనువు శిరంబు పోలికను
నీ మాయనొక్కటి నిర్మింపుమనుఁడు
వాఁడట్టు నిర్మింపవాని కొండాడి
పొండిమీవనికేగి భూపుత్రి జూచి
రాకెందు ముఖియింక రామునియాశ
నీకేల నీపతి నిదురింపుచుండ
నతని మస్తకము ప్రహస్తుండు కూల్చి
వితతంబుగా తలవిలుదెచ్చి యిచ్చె
ననుఁడు విద్యుజ్జిహ్వుండా చాపశిరము
లసుగ్రీవాద్దటు వైచి యరిగె నవ్వడును నా
శిరము చాపము జూచి సీత మూర్ఛిల్లె
నరిగె రావణుండంత ననువొంద సటకు
మరల నా విలుతల మాయమై చనియె
సరమ మూర్ఛనుదెల్పి అనకజ కనియె
ఓరామ! నీకింత యలుక నేమిటికి?
యా రావణుని మాయయని నిశ్చయింప
శ్రీ రాఘవుని యా త్రిజెందునే యనుచు
గారవించగ సీత కరుణతో నుండె
నంత వానర ఘోషమాలించి మదిని
చింతించి చింతల చివికి రావణుఁడు
తొదరి ప్రహస్తుని తూర్పు వాకిటికి
కదిమి దైత్యుల గూర్చి కాపుంద బనిచె
దక్షిణంబున మహోదర మహాపార్శ్వ

లక్ష్మణు బలయుతులైయుండ బనిచె
వలగొని పడమటి వాకిటియందు
చెలువుమీరగ నింద్రజిత్తును బనిచె
దనుజుల గూడి యుత్తరపు వాకిటికి
జనుఁడని పనిచెను సారణశుకుల
పుర మధ్యముననుండ పుత్తెంచెనప్పు
డరి భీకరుండగు నా విరూపాక్షుఁ
డంత రాముఁడు సువేలాద్రిపై నెక్కి
వింతగా లంకను వీక్షింపుచుండ
వన చరార్భకులు భూవలయంబు నిండ
విని పంక్తికంఠుడు విభవంబుతోన
గోపురంబున వచ్చి కూర్చున్న జూచి
భూపాలుండప్పుడద్భుతమంది పలికె
వినుము విభీషణ వీఁడెవ్వడనిన
తనయన్న యాతఁడు దశకంఠుడనుడు
తాపురసాప్త సందనుండంత చూచి
రామునికిని మ్రొక్కి రావణుపైని
కుప్పించి దాటి నెక్కొన్న కోపమున
నప్పంక్తి కంధరునదరంట మొత్తి
తనపేరు దాటి యాతని కిరీటములు
పనుపడితన్ని దోర్బల శక్తిమెరయ
రావణుండా కపి రాజును బట్టి
వావిరి గదత్రోని వక్షంబు పొడుప
కడగి వారిద్దరు కంతుక ద్వయము
వడువున కంఠీరవముల చందమున

కలయునంగంబు లేకంబుగా బెనగ
సొలసి వెంబడి రాక్షసుఁడు మాయలన్న
కని వాసరేంద్రుండు గ్రక్కున నెగసి
చని రామునికిని మ్రొక్క జననాథుఁడంత
యాలింగనముజేసి యతని కొండాడె
యా సులోచన యాసువేలాద్రిని డిగ్గి
వనచరావళితోన వచ్చి రాఘవుఁడు
దనరంగ డిగ్గె నుత్తరపు వాకిటను
వలిముఖులను గూడి వచ్చి నీలుండు
వలనొప్పడిగ్గె పూర్వ ద్వారమునను
తడయక దక్షిణద్వార మంగదుఁడు
కడువడి బంధించె కపులను గూడి
గురికొని పడమటి కోట వాకిటను
హరుల తోడుతగూడి హనుమంతుడుంచె
పది యోజనంబుల పరుపున నిట్లు
పదలక వర్తించె వానర సేన
యప్పుడు రఘురాముఁడంగదు బిలిచి
తప్పక నీవేగి దశకంఠుతోన
నికనైన జనకజ నిమ్మని బలుకు
సకల బాంధవులతో చనవలదనుము
కాదేని శూరుఁడై కదనంబు సేయ
నా దటరమ్మని యతనితో దెలుపు
మన మ్రొక్కి యంగదుండప్పుడె కదలి
దనుజనాథుని సభాస్థలి నిల్చిజూచి
యనుజుండు క్రమ్మర నేతెంచె ననుచు

దనుజులా తనిబట్టి దట్టింపబోవ
వారి వారించి రావణుండు భావించి
తారాత్మజుని జూచి తగనిట్టులనియె
నెవ్వని తనయుండ వెవ్వని బంట
నెవ్వంత నీవు పేరెరిగింపు మనుడు
ఓరి రావణ! తోకనాగి నిన్నుగట్టి
వారిధి ముంచిన వాలినందనుండ
నీ కొవ్వు పోలియించి నిను చెరగొన్న
యా కార్తవీర్యుని నణచె భార్గవుడు
నట్టి భార్గవ రాము ననిలోన లీల
పట్టి గెల్చిన రామభద్రుని బంట
నంగదుండను నీకు ననువుపచింతు
నింగితజ్ఞుడవేని భ్రాతవుగా గొనుము
శ్రీరామునికి నీవు సీత నొసగి
నీ రాజ్యమెల్లను నీవు రక్షించు
చెడు బుద్ధిచే నీవు సీతనీకున్న
కడగి యుద్ధముసత్రై కదలుమీక్షణమె
నీవు రాకున్నను నీదు జీవముల
నా వానరేంద్రులు హరియింతురని నప్పు
డన విని దశకంతుడతని బాధింప
దనుజుల బంచిన తారాసుతుండు
తనుబట్టి బాధించు దైత్యులనెల్ల
వినువీధి గొంపోయి విదలించివేచి
రాము సన్నిధికేగి రయమున మ్రొక్క
రాముడంగదునిపై గాగిల్లుచుండె

సంతట చాలించి యా సభ తేగ
డళ్లి తి పురంబున కరిగె రావణుండు
రాముఁడంతట కపిరాజును జూచి
తామసించక నీవు తగలంక లగ్గ
పట్టింపుమన విని భానుజుండనుప
బిట్టల్కతోడుత కపులెల్లగూడి
వికివిగా వాలముల్ విసిరి యాడుచును
తరువులు గిరులు సుద్ధతి చేతబూని
యగ్గలంబున వచ్చి యాలంక కోట
లగ్గబెట్టిరి కొండలము దైత్యులంద
నీరీతి కోటల నెక్కి వానరులు
వీర నాదములతో వెడలి రాక్షసులు
శూలంబులను గ్రుమ్మి సురియల పొడిచి
కాల దండోద్దండ గదలను మోఁది
ఖండి వాలములచే పిండిగా కొట్టి
దండించి కపులను తరిమిన పోక
కపులు కోపించి రాక్షసులపై కదిసి
విపరీత నఖముల విదళించి చించి
తరువుల మొత్తి భూధరముల నడచి
పురిగొని పోరాడ భువనముల్ వణకె
శరధులు కలంగె భూతలము కంపించె
కెరలి భూనభములు కెంధూళిగమ్మె
నప్పుడు రావణుండఖిల రాక్షసుల
రప్పించియు చించి రణముకై బనుప
వారణంబుల నెక్కి వాజులనెక్కి

దారుణంబైన గార్దభముల నెక్కి
యతులితంబు కనక శతాంగంబు లెక్కి
ప్రతిలేని శౌర్య సంపదలను మెరసి
భేరీ మృదంగాది భీమనాదములు
వీర దైతేయుల వీర నాదములు
భూనభోంతరములద్భుతముగానింక
దానవుల్ కపుల నుద్ధతిదాకి జాచి
కదిగి దైత్యుల తాకె కపిసైన్యమపుడు
తరయక ద్వంద్వయుద్ధంబయ్యెనందు
కడిమియై తాకెనంగదు నింద్రజిత్తు
జడియ సంపాతి ప్రజంఘుండు తాకె
ననుపమ విక్రముండతి కాయుఁడంత
వినతుని రమ్మని వెసతాకి పోర్చి
కదఁగి వాని రథంబు కడపెఁనంగదుఁడు
సారె ప్రజంఘుఁడు సంపాతి నడచె
వారక సంపాతి వాని వధియించె
వినతరువుల తాకె వెసనతి కాయుఁ
దని వారు లిద్దరు సతని నొప్పించి
రా సుషేణుని దాకె నటుమహోదరుఁడు
నా సుషేణుండు గూల్చె నా మహోదరుని
మకరాక్షు నెదతాకె మహిజాంబవంతు
నొకట విద్యుజ్జిహ్వుండొగి శతావలిని
కలయ విక్రమ ధనుగజుఁడు వధియించె
తొలఁగక కుంభుండు ధూమ్రు మార్కొనియె
థిరిగె గవాక్షుపై దేవాంతకుండు

శరభుని త్రిశిరుండు చలమున కదిసె
అల వనసునిపై నరాంతకుండలిగె
కలయంగ కుముదుండకంపను దాకి
కేసరిపైనచ్చెకి నిశిధూమ్రుండు
యీ సునతుకు దాకె నిలవేగదర్శి
అలగంధమాదనుండా మహాపార్శ్వు
నలుదాఁకె తపనుడున్మత్త జంబుమాలి
హనుమంతు దాఁకిన నతడు బంధించె
ననిదాఁకె మిత్రఘ్నుడా విభీషణుని
యా రవిజుండు ప్రహస్తుని నుంచె
సోరిమైందుతు వజ్రముష్టిని గూల్చె
యశని ప్రభుభువి గూల్చెనా ద్వివిదుడు
అశని తుల్యానికుంభుండా నీలు కవిసె
చని విరూపాక్షుండు సౌమిత్రిదాఁక
దనుజుని శరముల దట్టించ సతఁడు
రాముపై నుత్తష్కరశ్మి సేతుమట
నా మేయినాగ్ని కోపాగ్ని సేతువులు
చలమున వెనదాక జననాథుఁదలిగి
నలుగురి నిలగూల్చె నాల్గు బాణముల
అత్తరి భంగంబులైన చాపములు
తుత్తుము రైనట్టి తోమరంబులును
విరిగిన రథములు వెసబారు హరులు
కరిఖండలైనట్టి కరి శిరంబులును
కోర జీవముల దన్నుకొనెటి దైత్యులును
పొరలు సారథులు వాపోమయోధులును

కలిగి భయంకరా కారమై యొప్పె
కలితరక్తౌఘ సంగర భూమి బాధ
యంత నర్కుఁడు పశ్చిమాంబుధి గ్రుంకె
వింతగా చీకట్లు విరిసె దిక్కులను
తమ వేళగాంగనుద్దండ రాక్షసులు
గమనించి కపులతో కయ్యంబు సేయ
పడి శుకసారణ వజ్రదంష్ట్రులును
తదయక నా మహోదర మహాపార్శ్వు
రా మహాకాయుఁడత్యంత బాణముల
రాముని నొప్పింప రాఘవుండలిగి
యనలాస్త్రమున తను చిత్తమునణచి
యనువొంద శరణుల వారు సంధించి
యార్భరి దైత్యుల నగరంట న్యాయ
నార్భరినిల్వక నటపారిరండు
కలదైత్యులెల్ల రాఘవు బాణవహ్ని
శలభంబులై పడి సంసిరంతటను
అవని నంగదుడిట్లు నరదంబు గూల్చ
నవ పర్ణశాలకు వేగజని యింద్రజిత్తు
నవిరళ బలశాలి యా యింద్రజిత్తు
చెచ్చర రాక్షస సేనలగూడి
వచ్చి యద్రిశ్యుఁడై నడిచివినుండి
మసలక రామ లక్ష్మణులపై వేయ
ననద్రిశకాండంబు లందందనిచ్చి
వానరావళినంప వానలోసొచ్చి
పూనియార్పగజూచి సౌదలి లక్ష్మణుఁడు

కనుగొంటివే రామ కపటరాక్షసుఁడు
వనచర సేనసవ్వారిగా గూల్చె
మొనసినే బ్రహ్మాస్త్రమున వీనిద్రుంతు
ననవిని రఘురాముకను జన్మజూచి
భనునె యొక్కరునికై సమయింప జగము
మునము రాజధర్మము జూడ వేమి
పెరచిదాగినవాని వెన్నిచ్చువాని
శరణు జొచ్చినవాని చనిమ్రొక్కువాని
కదనంబుతో పూరి కరచినవాని
వదలియాయుధముల వనరెడువాని
తలజూపకనునని డాఁగినవాని
ఊలమితోడుత పుట్టలెక్కెడివాని
నిద్రలోయెడువాని నిర్జింప తగదు
భద్రంబుగోరు భూపతికి సౌమిత్రి
వనచరులను వీని వధియింప పంపు
మన సుమిత్రా పుత్రుఁడాగ్రహించెనగ
పరభయంకరుండగు పనకేసరిని
శరభుని నిషధుని సన్నాదుగజుని
వరుసనీలుని జాంబవంతుని బనుప
వానరపతులు పర్వత మహీజముల
పూనియప్పుడు నభంబునకు చిట్టెగయ
నా రావణాత్మజుండలిగి బాణముల
వారించి పడవైచి వసుధపై కపుల
బంధురంబుగ లోక బాంధవాన్వయుల
బంధించనటు నాగపాశ సంతతుల

నవనీతులపుడు సీతాహి పాళముల
వివశులై యున్నంత వీక్షించి నగుచు
చనియింద్రజిత్తు రాక్షసలోకపతికి
వినిపించ తనగల్పు వివరంబుగాను
తనయుని కొండాడి దశకంఠుదంత
జనకజకీమాట చక్కగా దెల్పు
దని రాక్షసస్త్రీలనంప వారెరగి
చిన్నగా హితవుదెల్ప భూపుత్రి
విన్నంత ధృతిమాలి విలపింప దొణగె
కటకటా రామనీ కార్ముకవింధ్య
లెటబోయె నీధైర్యమెటు బోయెనేడు
సకల లక్షణ బల సంపన్నుదయ్యు
నొకదైత్యుచే నిట్లు నొండాట తగవె
సౌభాగ్యవతి యంద్రు జనములునన్ను
నా భాగ్యమిట్లయ్యె నాథయేమందు
హానాథ! హావీర! హారామయనుచు
జానకి శోకింప సదయయై త్రిజట
ఓదేవి! నీకింత నలుక నేమిటికి
యాదయాంబుధి రాముడను జన్మతోన
నున్నాడు సుఖముగా నోయమ్మ జాడు
నన్ను వీక్షింపుము నామాట నమ్మ
కాదేని యీ పుష్పకంబేల మోచు
రారాత్రి నీకని రమణినూరార్చి
సుందరి త్రిజట యశోకవనంబు
నందు క్రమ్మరదెచ్చి యవనిజనుంచె

శ్రీరాముడట మున్ను చెలువొప్పదెలిసి
వీరుని సౌమిత్రి వెరగంది జూచి
చూడు నా తమ్ముని సుగ్రీవ నేడు
పాడి దప్పిటువలె పడియున్నవాఁడు
నితని బాసిన వెన్క నీ జీవమేల
ప్రతిలేని జయమేల భామినియేల
కట కటా్రియ్యారు కాంతలు వత్తు
రిటువంటి తమ్ముని నేనెందుకందు
పురమునకేనొంటి బోవుదునెట్లు
భరత శత్రుఘ్నులు పరఁగ తల్లులును
సౌమిత్రియేదన్న సన్నిధునుండి
యేమందు వారలకేమి జెప్పుదును
యీతండు నా జీవమితఁడు నా బంధు
వీతనితో గూడ వేవేగవాఁద
పరుగుము కిష్కింధకర్కజ నీవు
తరుచరులను గూడి తామసించకను
యన విని సుగ్రీవుఁడా రాము జూచి
జననాథ నీవిట్లు చలియింప తగునె
తొడరి నాకొక్క వేళతోచు నాపదలు
విడుతురే ధైర్యంబు విశ్వలోకేశ
యనిపల్కి కపిసూనుడంగదు బిలిచి
తనయ నీవింక నీ దశరథాత్మజుల
కాని బొమ్ము కిష్కింధకును నేను వేగ
తన యాప్తమిత్ర బాంధవులతో గూడ
రావణు పరిమార్చి రయమున లంక

నీవార్థిలోపల నేర్పడముంచి
వానరాధిపులతో వలనొప్పకేసు
జానకి కొనివత్తు జననాథు కడకు
ననుఁడు విభీషణుంశా రాము జూచి
తనమది శోకించె ధైర్యంబు వదిలి
యడరని దుఃఖంబు లందంద పొదల
సుడిగొని కపులెల్ల శోకించి రంత
నా సుషేణుఁడు వచ్చి యర్కజా జూచి
వాసి దప్పిటువలె వగచుట తగవె
హనుమంతు నంపించి యౌషధశైల
మనువొంద దెప్పించు మనుచుండెనపుడు
యాహూతమును సమ్మృతాబ్ధి యుత్తరపు
తీరంబు నందుండి దిగ్గనలేచి
రెండు రెక్కలతోన రేగి పైనుండి
కొండ చందంబున ఘోయని యార్చి
తరుచుగా నింతి పతత్ర వాయువులు
గిరుల వృక్షముల మిక్కిలి పెల్లగింప
ఘానుకోటి ప్రభా ధాసురుఁడగుచు
వైన తేయుఁడు రాగవనదరుల్ జూచి
వెరగొందుచుంటనా వినతాతనూజుఁ
డరుదేరి నృపతుల నందంద జూచి
మరుగు రెక్కల చేత మేనులు నిమిరి
యురగపాశమ్ముల నెరగి విదారించి
యీ నాగపాదమ్ములిటు మిమ్ము జాసె
దానవాధముడగు దశకంఠు డ్రుంచి

ధరణిజ గానినయోధ్యకు బొమ్ము రామ
సరసతనే నీకు సఖుఁడనై యుందు
ననిచెప్పి పక్షీంద్రుడమృతాబ్ధి కరిగె
జననాథులంత నుత్సాహులై యుండి
రా మహా వానరులానందమునను
రామ లక్ష్మణులకు రహిఁ మ్రొక్కి రంత
శంకింపకను కపి సైన్యంబు లెల్ల
లంకా పురంబగ లంగనార్వంగ
నంత సూర్యోదయంబైనను జూచి
వింతగా రాముని వృత్తాంత మరసి
చారులు చెప్ప రాక్షస విభుండలిగి
పోరికై ధూమ్రాక్షు పొమ్మన్న వాఁడు
భేరులు శంఖముల్ పృథుమృదంగములు
భూరిఘోషమ్ముల భోరున మొరయ
నుదయార్క సంకాశ మొక రథంబెక్కి
పదిలుండై యేతెంచి బలముల తోన
వానర సేనలవడి గూల్చుచుండ
వానరుల్ గారగ వాయునందనుఁడు
కాలాగ్నిరుద్రుఁడై గదిమివాఁడేయు
బాణములను ద్రుంచి వడిగొల్పి రథము
మహా సాల వృక్షములతో నద్రిపై వైచి
ధూమ్రాక్షు శిరము నిర్ధూమంబు చేసె
నా వార్త విని రాక్షసాధిపు డలిగి
కావరంబుదనర నకంపను బిలిచి
వానికి పొమ్మన్న వాడరథంబు నెక్కి

దనుజులతోడ నుద్ధతి నేగుదెంచి
కపి సైన్యముల సాయకముల నొప్పించి
విపరీతుఁడై రాగ వీక్షించి కపులు
తరులను గిరులను దనుజ సైన్యముల
పరువడి నొప్పింప పవన నందనుని
యా యకంపనుఁడు సాయ శరముల ముంప
వాయు పుత్రుండొక్క వర వృక్షమునను
కంపింప దనుజుల కంపను బట్టి
చంపు వానర సేన సన్నుతింపగను
పరులచే నకంపనుఁడు కూలుటయు
పరితాపమున విని పంక్తి కంధరుఁడు
నరుల వానరుల మిన్నక ద్రుంచు మనుచు
శరవర్తి నా మహాకాయుని బనుప
నా రాక్షసుండు శతాంగంబు నెక్కి
దారుణా కృతితోన దక్షిణ ద్వార
మునరాగ దైత్యులు మొనసి వానరుల
మొనలుదీరిన బల్లెముల గ్రుచ్చి గ్రుచ్చి
కరవాలముల నొంచి గదలచే నదచి
సురియలనాడించి శూలాల బొడిచి
పరిఘల విదళించి పట్టె నప్రాస
శరపరంపరలేసి చక్రముల్ వైచి
కడువడి నొప్పింప కపులు కోపించి
విడువక నా దైత్య వీరపుంగవుల
మోకాళ్ళ పొడిచి నిమ్ముల పరద్లకరచి
తోకలను చుట్టి గొంతుల నురిబెట్టి

గదిమీ గోళ్ళనుచించి కతకాళ్ళదంచి
గదిసిట్లు రాక్షసుల్ కపులు పోరాడ
నంగదుపైని మహాకాయుండపుడు
పొంగుచురాగ నప్పుడు పేర్చి యార్చి
వానర ప్రముఖులు వైచి శైలముల
వాని మంత్రులనెల్ల వధియించి రంత
అంగదునపుడు మహానాధుండె విరి
సంగతిగా మూడు శరముల నేయ
అతుల కోప స్ఫూర్తినంగదు డంత
అతని శతాంగంబునవనిపై కూల
పట్టి భూధరముపై పడవైచి కుమ్మ
మెట్టిగద్దురుకంగ మెడద్రుంచివైచి
తమ్ముడు కూలనుద్దండ కోపమున
నా మహాకాయుండయ్యంగదు పైని
తోలించి రథము తోడ్తొన బాణములు
కీలించి యంగదు కేరి యిట్లనియె
వోరి వానర వినకొని నీ మీద
నా రాచముల కొట్టనాయంటె తనకు
శివుని చాపము ద్రుంచి సీతచేకొన్న
యవనీశుడైగాని యమ్మని విడువ
పరశురాముని భంగపరచిన యట్టి
హరి శౌర్యుడైగాని యమ్మనే విడువ
వీరుడై యాఖరుని దలిచినట్టి
యా రాజుడైగాని యమ్మనే విడువ
యా వాలి నొక కోలనని గూల్చినట్టి

యా వీరుపైగాని యమ్మునే విడువ
తూరివార్ధిని యందు సేతువు గట్టినట్టి
యా రామునిపైని యమ్మునే విడువ
భుజబల స్ఫూర్తిని పొదలి లీలగను
రజతాద్రి యెత్తిన రావణుసుతుఁడ
తుది నేను యింద్రజిత్తునకు తమ్ముఁడను
యిదె మహాకాయుండ నే తెచ్చినాఁడ
నని బల్కి పేర్చు మహాకాయు జూచి
పనువడి సుత్రామ పాత్రుఁడిట్లనియె
హోరి మహాకాయ హోరి దురాత్మ
యీరీతి బీరంబులేల నాడెదవు
మీ తండ్రి గిరియెత్తి మెరసె మాతండ్రి
మీతండ్రి నెత్తి నెమ్మిగ వార్ధిముంచె
నీలావు పొలియనే నిను ముంతునసుచు
వాలి నందనుండు దుర్వారుఁడై పేర్చి
పరఁగు రాక్షసునిపై పర్వతం బేసె
శరపరంపరల రాక్షసుండది గూల్చె
నారసి తేరుపై నంగదుండురికి
హోరి సారథితోన పొడిపొడిజేసె
దనుజుండంగదుఁడును తలపడి యపుడు
దనరుచు మల్లయుద్ధము సేయుచుండ
కరముల నురముల కాళ్ళను వేళ్ళ
సరి సరిపోరి రాక్షసు రొమ్ము ద్రొక్కి
యడుగుల పడదన్ని యమ్మహాకాయు
మెడనుల్కి తలద్రెంచి మిన్నంటవైచె

హత శేషులంత మహాకాయు పాటు
వితతంబుగా విన్నవింప శోకించి
యా రావణుఁడు ప్రహస్తుని బిల్చి
యా రాముపైనంప నా ప్రహస్తుండు
రావణ వినుము శ్రీరాముని మీద
నీవు పొమ్మన్నను నే నిల్వరాదు
చనువున బుద్ధులు సచివులు జెప్ప
వినవైతివికనైన విభుసీత రామ
జననాథునికి నిమ్ము సంధిగావింపు
మని జెప్పి వీడ్కొని యా మంత్రివరుఁడు
నతి జయప్రదమైన యరదంబు నెక్కి
చతురంగ బలముల సంఖ్యలు గొలువ
కాలాంతకుని రీతి కార్ముకంబంది
వాలమ్ము సంధించివచ్చిన జూచి
వనచరులెల్లను వడిబారుచుండ
జననాథుఁడా విభీషణుని కిట్లనియె
తేజంబు బలమును దీప్తశౌర్యంబు
రాజిల్లుచున్న యీ రాక్షసవరుని
పేరేమియన్న విభీషణుండనియె
నా రావణునికి మీఁదాప్తుండు దేవ
కలిగిన సైన్య సంఘములకు నెల్ల
దళవాయి యీతని దళములతోన
మూఁడవ పాలిండు మొనసియేతెంచె
వాఁడే వీరుఁడు రావణుని మాతులుండు
తపన కులేశ యీ దైత్యునితోన

కపీనాదులకు తెస్స కయ్యంబు కలుగు
నని చెప్పుచుండఁగ నగచరులెల్ల
దనుజ సైన్యముల నుద్ధతి తాకిరాకి
కొండలుపై వైచి ఘోయని యార్చి
చండ భూజమ్ముల చరియంగ మొత్తి
పొరపైన నఖముల నురములచించి
విరివిగా తోకల విసరి యాడగను
కపుల రాక్షసులు రాక్షసులను కపులు
కుపితులై పోరనెకొన్న కోపమున
ద్వివిదుండు కుధరంబు తెరగొప్పవైచి
అవిరళ శక్తిన కాంతకు గూల్చె
ననిలోన యశకుంభహనుమ కీటణచె
మునుగాని యొక వటంబున తారుఁదతిగి
వదలక గిరి జాంబవంతుండు బూని
యదరంట వైచి మహానాదునణచె
తరమి దుర్ముఖుండొక్క తరువెత్తి దివిజు
లరువొంద వధియించె నా సమున్నతుని
తనమంత్రు లిటువలె ధరణిపైబడిన
కనలి ప్రహస్తుండు కాలాగ్నిమాడ్కి
దూకొక్క శరమున నొకలక్ష కోటి
తక్కిన కపుల విదారించి నైవ
నిలునిలుమని వచ్చి నీలుఁడావేళ
బలమున నొక్క వృక్షము పెల్లగించి
తెరలి ప్రహస్తుని తేరుపై దాకి
హూరాల నొరదినెత్తి యదరంట మొత్తి

యదలించి యార్చిన యా ప్రహస్తుండు
గదగొని నీలు నక్షంబున బొడిచె
బొడిచిన మూర్ఛిల్లి భూమిపైవాలి
తడయక తెలిసి యుద్ధతి నీలుడంత
పొదవైన యొక మహా భూధరంబెత్త
తొడబడి యా ప్రహస్తునిమీద వైచె
వైచిన నెత్తురుల్ వాత గ్రమ్మగను
కోంచకూలు గూలి కూలె భూస్థలిని
నీలుండప్పుడు రాజన్నృపునికి మ్రొక్క
నాలింగనము జేసె నతని రాఘవుడు
చెదిరిన రాక్షససుత శీఘ్రంబులోయి
తుదిముట్టి యా ప్రహస్తుని పాటుదెల్ప
వెరచి మంత్రులజూచి వెరవొప్ప బలికె
గరిగొని తలపులు కొనసాగదయ్యె
దూరమున కేగు దైత్యుడొక్కడైన
మరలిరాడిది యేమి మాయయో యెరుగ
నీచ వానరులట్లు నిఖిల దానవుల
నేచినప్పుడె జూచ యిది కాలకీడు
తొడబడి యొకపని తొడగంగరాదు
తొడిగి పిడిన బహు దుష్కీర్తి గాన
చని నేను రామలక్ష్మణుల వానరుల
ననిలోన వధియింది యవనిజతోన
ననుభవింతును సౌఖ్యమనుమానమేల
ఘన చాపసాయక కలితమౌ రథము
తెరగొప్ప తెమ్మన్న తెచ్చిరంతటను

కురులు గంధర్వులు జూచి భీతిల్ల
దశముఖుండప్పుడు తన రథంబెక్కి
విశదంబుగా పది విండ్లు చేబూని
పటుతర నిస్సాణ ఝాంకారములును
పటహ భేరీ శంఖ భయద ఘోషములు
హస్తిబృంహితములు నశ్వఘోషలును
ప్రస్తుత పాఠక ప్రకర నాదములు
కమనీయ రథనేమి ఘర్ఘర ధ్వనులు
సమితంబులగుచు బ్రహ్మాండములునింప
తన తనయుండు రామ ధరణీశు జేరె
తనమీద దండెత్తి తరలి నాడనుచు
పనువడి దాగిన పగటి రెంధూళి
కనుబడండాయను కమల బాంధవుడు
వికృత చూపంబులు వికృత నేత్రములు
వికృత వక్త్రంబులు వికృత గాత్రములు
కలిగి భీకరులు రాక్షసులేగుదేర
జలధులు కలంగ దిక్చక్రంబు పగల
తడయక నప్పుడు త్వర వాకిటను
వెడలిన రాక్షస విభుని వీక్షించి
భావించి భావించి పలుమారు మెచ్చి
యా విభీషణునితోన ననియె రాఘవుడు
యీ వచ్చు వాడెవ్వడీ మోధుడెవ్వడు
నను విభీషణుండా రాముకనియె
మనుజేశ వినుమహా మదగజంబునను
గానకొని యెక్కి యంకుశము చేబూని

ఘనమైన నవరత్న కంకణములు దనర
ఘోనమైన ముత్యాల గొడుగులనీడ
కమల బాంధవు రీతి కాంతి వహించి
గరిమెతో దైత్య సంగతి వచ్చునాత
డురుశక్తి గలిగిన యురు పాశుండధిప
వీరుఁడై రథముపై విలసిల్లువాఁడు
వారుణాకృతి మహోదరుఁడు శ్రీరామ
ఘనమైన సితఘోటకంబుపై నెక్కి
చనుదెంచువాఁడు పిశాచ నాథుండు
పనుపడి సింహంబుపై వచ్చువాఁడు
దినకర కులనాథ త్రిశిరవన్వాఁడు
చలమున కాంచనోజ్వల రథం బెక్కి
తలకొని విలుగుణ ధ్వనులు సేయుచును
దొరసిన సర్పకేతువు గలవాఁడు
గురుశృంగ బలశాలి కుంభుండుదేవ
అతని వెంబడి విశతాంగంబు నెక్కి
ప్రతిలేని హేమ చాపము చేతఁబూని
యరిముఱి చనుదెంచు నా రాక్షసుండు
గురుశైలనిభుఁడు నికుంభుండు దేవ
కనక రథంబెక్కి కపులపై పగుల
కణలుచు మణి కార్ముకంబుచే బూని
యని సేయ సన్నద్ధుఁడై వచ్చు దైత్యుఁ
డనుపమ బలుఁడు నరాంతకుండధిప
భీషణాకారుఁడై పేర్చి వాక్యములు
ఘోషించి లయకాల రుద్రుని మాడ్కి

కరముగ్రులైన రాక్షసులు కొల్వగను
పరుదెంచువాఁడు దేవాంతకుండధిప
ఘనమైన ఘోషంబు కలపైడి రథము
దనరార నెక్కి యుద్ధండుఁడై చేర్చి
యరుణాంబరమ్ముల నరుణమాల్యముల
నరుణ గంధమ్ములన నలరి కోపించి
సంధ్యాంబుదచ్చాయ చనుదెంచువాఁడు
వింధ్యాచలముబోలె విలసిల్లువాఁడు
శూరుఁడై మనల జూచుచు వచ్చునాతఁ
డా రావణుని సుతుండతి కాయుండధిప
భూరిసితచ్ఛత్రములు పదివేలు
దారు చామీకర చామరావళులు
వెలయ రథంబెక్కి విలుచేతఁబూని
కలిత శస్త్రాస్త్రనికాయుఁడై పేర్చి
సురపతి చెరబట్టి సొంపారినట్టి
వర గర్వమున వచ్చు వాఁడింద్రజిత్తు
పసిడి కొండల చేత భాసిల్లిరుచుల
మసలుచున్న చామరములు వీవ
ఒక భానువుల మాడ్కి దశ కిరీటములు
దశ శరంబుల యందు దనరారు చుండ
రోషమహాదృష్టి రోచుల మిసుల
భీషణాకారుఁడై పేర్చినవాఁడు
దనరుకైరావత దంత ముద్రికల
మొనసిన పెను వక్షమున నొప్పువాఁడు
హరునితో కైలాస మగలించినాఁడు

సరిలేని చంద్రహాసము గొన్నవాఁడు
త్రిజగముల్ భీతిల త్రిదశుల గెల్చి
భుజబల స్ఫూర్తుల పొదలిన వాఁడు
మొనసి సేనామధ్యమున వచ్చువాఁడు
వనజాప్త హితవంశవాఁడు రావణుఁడు
అనుచు విభీషణుండాడు వాక్యములు
విని రామచంద్రుండు విస్మయం బంది
యిట్టి తేజమ్ముల నిట్టి ధైర్యమ్ముల
నిట్టి వైభవముల నిట్టి సంపదల
గట్టిగా జూడ రాక్షస కులంబునను
పుట్టడొక్కఁడు వీఁడు పుట్టి వింతగను
క్రూర కర్మముల గైకొనకుండెనేని
యీరెండు జగముల కితఁడు పూజ్యుండు
వాలిన భుజశక్తి వడిలేని భటులు
కాలరుద్రునినైన గదుముదు రనుచు
నాగ్రహంబున రాముఁడా దశగ్రీవ
నిగ్రహక్రమ కళానిపుణుఁడై పేర్చి
యనికి సన్నద్ధుఁడై యనుజన్ము చేరి
ధనువందుకొని గుణధ్వని సేయుచుండె
అప్పుడు రావణుండసుర యోధులను
తప్పక జూచి రాతగదు నావెంట
వచ్చిరేని యీ వనచరుల్ కోట
జొచ్చిన మనలావు చొప్పడదపుడు
కావున లంకకు కదంగి పొమ్మనుండు
వేవేగ రాక్షస వీరులు జనిరి

దశముఖుండంతట ధనువుచే బూని
దశదిశల దరనుద్ధతిని పేర్చుచును
కరకు బాణముల పుంఖాను పుంఖముగ
పరువడి వనచర బలముపైనేయు
నాశిలీ ముఖముల నంగముల్ నొగిలి
కీశులు భయమంది కీచు కీచనుచు
ఘోర బోపలబడి పొరలు వానరులు
పారు వానరులును భ్రమయు వానరులు
శూలు వానరులును క్రుంగు వానరులు
వ్రాలు వానరులును వనరు వానరులు
కలిగి సంగరము భీకరమైన జూచి
బలరిపు ప్రముఖులు భయమందిరపుడు
సుగ్రీవుడంతట శూరత మెరసి
యాగ్రహంబున భీకరాద్రిని వైచె
వైచిన కనలి రావణుడు శైలమున
చూచి బాణమ్ముల చూర్ణంబు జేసి
దండధరోద్దండ దండంబు బోలు
కాండంబువింట నొక్కటను సంధించి
వాలిన శక్తియై వక్షంబు నేయ
నాలోన సుగ్రీవుడవనిపై బడియె
భుజబలాఢ్యుడు ఋషభుడు సుదంష్ట్రుడు
గజుడు గవాక్షుండు గవయుండు నలుడు
జ్యోతిర్ముఖాదులు జూచి కోపమున
నాతత వృక్ష శైలాదులనేయ
నవి ద్రుంచి రావణుండమిత బాణముల

నవనిపై పడవైచె నా యేడుగురుని
వాయుజుండపుడు రావణు తేరుపైని
పోయక దుమికి కోపమున నిట్లనియె
ఓరి రావణ వినరోరి మూఢాత్మ
యీరేడు జగముల ఇంద్రాది సురుల
క్రౌర్యంబును విడక త్రుళ్ళించుచునీవు
త్రుళ్ళనంతే చోటు తొలగించె ననిన
వీక్షించి రాక్షస విభుఁడాంజనేయు
వక్షంబు బొడిచినవణకి వాయుజుండు
వడిచేర్చి రావణువక్షమ్ము నపుడు
పిడుగుతో సరియైన పిడికిట బొడవ
పడి మూర్ఛజెంది వెంబడి మూర్ఛదెలసి
అదరుచు రావణుండనిలజు జూచి
నీలావు కొండాడ నేనెంతవాడ
మేలు పావని నిన్ను మెచ్చితిననిన
రావణ నాలావు రహినెక్కు గలదె
నీవు ప్రాణములతో నిలిచిన యపుడె
యన విని రావణుండలిగి వాయుజుని
పెనుపొందు వృక్షంబు పిడికిట పొడిచె
పొడిచిన మూర్ఛిల్లి పొలుపెల్ల పొలిసి
పడియె వాయుజుఁడంత పంక్తికంధరుఁడు
నీలుపై కవిసిన నీలుండు పేర్చి
శైల శృంగముల వృక్షంబులనేయ
తెలిసి మారుతి నీలుదెస రావణుండు
కలహింప జూచి యక్కడ పోకయుండె

ఘనుఁడాతనునిమీఁద వలయ శృంగంబు
గొనివైచె నీలుండు కోపించి పేర్చి
ఘనిమై రావణుండది తొడరి బాణముల
గని నీలుఁడప్పుడు కరలాఘవమున
దనుజులు కనుగొని తల్లడంబంద
దనుజేశు రథముపై తద్దయు నుఱికి
పొడిచేసి కేతనమ్ముల చామరముల
విడువక చాపంబు విరిచి పోవైచి
యొక మోళిపైయుంచి యొక మౌళిపైనుండి
యొక మౌళివ్రేసి యొక మౌళిజూచి
పెనచి హారంబులు పెరికి పోవైచి
దనరగ సింహనాదము సేయ జూచి
కనలి రావణుడగ్ని కాంతంబు తొడిగి
యనల పుత్రునికేయ నతడంత బడియె
సౌమిత్రి యంతట చాపంబు బూని
త్రిధనువంది చనుదేర జూచి
యా మహారాక్షసుండనియె నవ్వుచును
చక్కఁగా లక్ష్మణ చాపంబు చేబూని
యెక్కుఁబెట్టగ నేరవింక బాలుఁడవు
వలనొప్పనని సేయ వచ్చితివేని
బలియిత్తునిను భూతపంక్తుల కనిన
వలదిట్టిమాట రావణబంటవై తె
నిలిచి పోరాడుము నీలావుఁజూపు
మన పంక్తిముఖుఁడు రామానుజు మీఁద
సుని శిలాస్త్రంబులు సోనలై కురియ

నరఁడు కోపించి దశాస్యు బాణముల
ప్రతి బాణములనేసి భగ్నంబు జేసి
విలుద్రుంప రాక్షస విభుఁడు కోపించి
చలమున నలబ్రహ్మశక్తి వైచినను
వలగొని కాళాగ్నివలెవచ్చి శక్తి
కలయ నాటినను లక్ష్మణుడట్టె బడియె
నరసిదశాననుండంత లక్ష్మణుని
నిరువది చేతులనెత్త బోయినను
నారఁడు నారాయణాంశంబు గాన
నే తెరంగున వానికెత్తరాదయ్యె
వూనిరి కైలాస భూధరం బేను
నానాటి బలమెందు నణగె నేడనుచు
భీమహాస్తంబుల పెనచి రావణుఁడు
సౌమిత్రి నెత్తెడి చందంబు జూచి
యరిమురి కోపించి యాంజనేయుండు
కరకు రాక్షసుని వక్షస్థలి పగుల
పొడిచినంతన మూర్ఛపొంది రావణుడు
కడుదూలి నెత్తురుల్ గ్రక్కి బోరిగిల
పడియె పిరుందను పదమిడలేక
పడిన రావణుని దుర్బలము నీక్షించి
పావనియును విష్ణు భక్తుడుగాన
రావణునకు నెత్తరాని లక్ష్మణుని
చేరుకొని యవలీల కొని దెచ్చిరామ
జనవాధు ముందర సరగున నుంచె
నట రాక్షసేశ్వరుండమ్మూర్ఛ దెలిసి

చటుల బాణాశరాసన సన్నద్ధుతయ్యె
హనుమ పాటున జూచి యా రాఘవుండు
కనలి రావణు మీద కరమర్థిననిన
అనిల తనూభవుండనియె రామునకు
యిన కులాధీశ్వర యీ దశగ్రీవుఁ
వరధంబుపై నుండి యాలంబుసేయ
గరిమెగాదిది నీవు కాల్నడన చనియె
రావణు శక్తి సౌమిత్రి బాసి
మొనసి లక్షణుడంత మూర్ఛతెప్పిల్లె పంక్తిరు
వనసపుడు సంప్రీతి హనుమంతు నెక్కి
యనిమిష కరిమీది యమరేంద్రుఁడనగ
నొప్పి గుణధ్వని నొయ్యనసేయ
యప్పుడు కోపించి యసుర వల్లభుఁడు
భీమాహులను తోలిపేర్చు బాణముల
రాముపై నేసిన రాముండు కనలి
చక్కగా వెసనర్ధచంద్ర బాణమున
రక్కసు విలుద్రుంచి రయమున వాని
మర్మముల్ నొప్పింప మసలక నొక్క
ధర్మంబు గానియార్చి దశకందరుండు
పటు బాణమొక్కటి పవన నందనుని
నిటలంబు నేసిన నెత్తురుల్ పొదమె
చూచి యా రాముండు శూలి చందమున
మించి కోపానలంబెసగ కన్నులను
కర్ణంబు దొడిగె యా పంక్తి కంధరుని
వీల్లంత తోపల. విరుగంగ జేసి

యొక్కట సారధి నొకటనశ్వముల
నొక్కట నరథంబు నొకట పతాకఁ
నొక్కట గొడుగుల నొకట వస్త్రముల
గ్రక్కుననేసి చూర్ణములుగా జేసి
పది శిరంబులవాని పంక్తికంధరుని
పది కిరీటంబులు పడడొల్లనేయ
ననికి నిశ్చేష్టుఁడై నొదల దాల్చి
ధనుజేశ్వరుడుండ తగ రాముఁడనియె
కపులతో పోరాడి గాసిల్లినావు
కపట రాక్షస నిన్ను కదతెర్చరాదు
నీవు లంకకు వేగనేడు బొమ్మనిన
రావణుం దప్పుడు రాము మెచ్చుచును
కరకెల్లనుడిగి యొక్కరుఁడుగా బోయి
పరగ యా లంకలోపల జొచ్చెనంత
నీరీతి లంకకు నేగి రావణుండు
శ్రీరాము శౌర్యంబు చింతించి వగచి
తన మంత్రులను బిల్చి తగనిట్టులనియె
తన గర్వబలము లంతయు రాముడణచె
ననిలోన నా ప్రహస్తాదులు జనిరి
ఘనవంశ గెల్వనింకెవ్వఁడున్నాడు
ఘన బలుండగు కుంభకర్ణుండు దక్క
తను దాని మేల్కొంచి తగవిభీషణుతో
నలరి యేతెంచి మంత్రాలోచనంబు
పొలుపారగా జేసి పోయి క్రమ్మరను
నేడు తొమ్మిది నాళ్లు నిద్రయ్యె నున్న

వాడు శత్రువులనెల్ల వధియింపగలడు
తడయక మీరలాతని మేలుగొలిపి
విడువక లెమ్మన్న విని దైత్యవరులు
తరలి వారపుడు నిద్రాగుహ జొచ్చి
విరివిగా నటు హేమ వేదిక మీద
పుడుగని బెట్టూర్పు లుప్పతిల్లంగ
కడు నిద్రగాను కుంభకర్ణుని జూచి
యురువడి శంఖంబులూదియు బెట్టు
మెరయంగ నిస్సాణములు దుందుభులను
జెంది వ్రేసియు తోన సింహనాదములు
సందండ చెలఁగింప నా మహారవము
ఘనభోంతరములు పొలుపొందనింద
దానవుడందు సల తగమేలుకొనక
నిదురబోవగ జూచి నిఖిల రాక్షసులు
గదలును ముసలముల్ ఘనముగ్గరములు
పదివేల కుంతముల్ పైని వైచుచును
వదలక కొండలు వైచి యార్చుచును
యురముపై మెట్టుచు నొగి వృక్షములను
శిరము తాటింపుచు సింధురంబులను
పోతుల మేకల పులుల దుప్పులను
టాఠిగా ఖరములపైని మెప్పించి
కొటది మీరిన నూనెకుండలు కాచి
పలుమారు చెవులలోపల పోసిపోసి
ప్రకటంబుగ గడ్డపారల గాల్చి
భీకర నాసికా బిలముల బెట్టి

రక్కసులారీతి రాయడి సేయ
నొక్కంత మేల్కొని హుమ్మని నిలిగి
బడబాముఖాభమై పరగిన నోరు
తడయక తెరచి వింతగ నావులించి
శ్రీరాముచే ముక్తి చేకొన కోరి
దూరంబుగా నిద్ర తోసిన మాడ్కి
ప్రళయ కాలాగ్ని బింబంబుల బోలు
కలయంగ నెట్టని కన్నులతోన
కనువిచ్చి యసురులు కంపింపమేలు
కని కుంభకర్ణుండుగ్రతను కూర్చుండి
అనుపమంబైనట్టి యాహారకాంక్ష
తనయొద్ది రాక్షసతతిజూడ వారు
నిరవొందగా నప్పుడిరువది యొక్క
పురుషుల మాంసంబు ప్రోవుగా బోసి
యెనబది వల భాషంబులెనదు నూరజముగ
లును వేయు క్రోడంబులును నాల్గు వేలు
ఘన శశంబులును మృగంబులార్న్నరు
ననువొందగా దెచ్చి యవి వేరువేర
దంపి సుపక్వమాంసంబులు మిగుల
నింపార నాతని యెదుట బోయుటయు
దనిహారయెసరి యుద్ధతి రెండు వేలు
ఘన ఘటంబులలోన కలమధ్యమాని
పటపట దిక్కులు పగలదెల్లుచును
కటుతరంబులైన మీసములు దీర్చుచును
తనమున్న నిలిచిన దానవ తతి

కనుగొనీ యా కుంభకర్ణు డిట్లనియె
మీరు నన్నేటికి మేలు కొల్పితిరి
వారక రాక్షసేశ్వరునకు శుభమె
యనిన యురూపాక్షుడు హస్తముల్ మొగిచి
వినుదేవ రాక్షస విభుండు శ్రీరాము
రమణి నెత్తుకురాగ రామలక్ష్మణులు
సమర భీకర కపి సైన్యముల్ గొలువ
వనధి బంధించి వడిలంక జొచ్చి
యనిలోన యా ప్రహస్తాదుల కూల్చి
నిన్న మీయన్నను నెరయ నోడించి
యున్నారు గావున నులికి రావణుఁడు
నినుతోడి తెమ్మనె నీవు విచ్చేయు
మన కుంభకర్ణు డిట్లనియె వానికిని
నరుల వానరుల రణంబున గూల్చి
మరలి నేవచ్చెద మాయన్నకడకు
ననిన మహోదరుండనియె కేల్మోడ్చి
వినుదేవ రాక్షస విభునిచే నీవు
పనులెల్లవిని బోయి పగతుల గెల్వు
మనిన యట్లేగాక యని కుంభకర్ణుఁ
డనుకూలమయ్యె నా చేత బూని
కనులను కోపాగ్ని కణములు చెదర
ధరమర్థి తనపాద ఘట్టనంబునను
శరధులు కలఁగ దిక్చక్రమల్లాడ
బిటంబుతో వచ్చువాని రూపంబు
కోట యవ్వలి కపి కోటులు జూచి

పరచి దిక్కులను వాపిరి పారుచుంత
పరువడి కొందరు భ్రమసి మూర్ఛిల్ల
తమ్మునిచేనున్న ధనువు చేయూని
యమ్మహీశుఁడు రాముఁడనుజుఁ గనియె
యీవచ్చు రాక్షసుండెవఁడు లోకముల
నాపటంచును రూపసుత్వంత భయద
మునిస విభీషణుండా రాముఁజూచి
వినుదేవ దెల్పెద వీని చందంబు
వడిగలవాఁడు రావణు సహోదరుఁడు
కడు క్రూరమతి కుంభకర్ణుఁడన్వాఁడు
పుట్టినప్పుడె వీఁడు భువనంబులెల్ల
పట్టింపఁగ పద్మజుండలిగి
నీవు సతతమును నిదురబొమ్మనుచు
చావుతో సరియైన శాపంబొసంగి
రావణుండప్పుడు రాజీవభవుని
వావిరి ప్రార్థింప వనజుండప్పు
డక్కజంబుగను వీఁడారెడు నెలల
కొక్కొక్క దినము మేల్కొని యుండుననియె
నానాటి మొదలు నిద్రాసక్తుండగుచు
దానవుడుండును దశముఖుండపుడు
దేవరచే నోడి దీనుఁడై పోయి
వేవేగ పిలిపింపవీఁడు మేల్కాంచి
దేవారి నగరి కేతెంచుచున్నాడు
భావించి కపులెల్ల భయపడకుండ
నసురగాదొకదారు యంత్రంబటంచు

వెనసు చాటించిన వెరవొప్పదేవ
యనవుడు నీలున కానతియిచ్చి
ఆననాదుడిభ్రంగి చాటంగ బనిచె
గరిమె నంతట కుంభకర్ణుండు నగరి
కరుదెంచి సాష్టాంగమున్నను మ్రొక్కి
మగరాల పీఠిని మలసి కూర్చుండి
నగధీర రావణ నిన్ను మేల్కొలుప
కారణంబేమి చక్కగ దెల్పుమనిన

—:కుంభకర్ణుని బుద్ధి:—

నారాక్షసేశ్వరుండను బన్ను జూచి
వనచర సేనతోవచ్చి రాఘవుడు
వననిధి బాధించి వడిలంక జూచి
యనిలోనం మా ప్రహస్తాది వీరులను
దునిమె నీవిప్పుడు దోర్బల శక్తి
తరుచరావళిలోన దశరథాత్మజుల
వరిమార్చి యీలంక పాలింపుమనిన
విని కుంభకర్ణుండు విభుదారి కనియె
మును రాము భార్యను ముచ్చిలి నీవు
తెచ్చినప్పుడె కీడుదెచ్చితివధిప
యిచ్చట పునరుక్తులేటికి నిరను
తుద మొదలెరుంగక దుర్మదంబునను
వదరిలసౌమ్యుడు కార్యభాగంబు సేయు
బాడాపదల పొందు పాతందులిందు
బాడనసేల రావణ నీవెసుమ్మి
మతిగల వారల మంత్రాను మతుల
కృత కార్యములు బరికించునే విభుడు

నేగి ప్రభుమంత్ర సమతోత్సాహ శక్తు
లగణిత ఫలదంతంబులైవాని కమరు
పతి దేశకాల విభాగంబు లెఱిఁగి
చతుర జనభృత్య సంపద గలిగి
శౌర్యంబు మీఁదగు కార్యమూహించి
కార్య విఘ్నప్రతీకారంబు దెలిసి
ఫలసిద్ధికైకేని బహు రాజ్యఁభోగ
ములనిత్యుఁడై యుర్విమోదింపవలయు
నగవాని భుజశక్తి భావించి సంధి
తగు బుద్ధియై జేయ తలపోయవలయు
రూపింప సమబల రూఢిని తోడ
నేర్పుతోడుత నిగ్రహింపంగవలయు
నటుగాక బలశూన్యుఁడగుట చింతించి
పటు సత్వుఁడై శత్రుపై నెత్తవలయు
విడిసిన బలము వివేకించిమీద
విడిసి మార్తురగెల్వ వెరపొందవలయు
వైరుల సాధ్యులై వ్రాలిన వారి
తో రెండు పుట్ట ప్రలోభింప వలయు
నతి సత్వులై వైరుల జితులై రేని
హితబుద్ధియై నాశ్రయింపంగ వలయు
నీయాఱు గుణముల నెఱిగి వర్తించు
నా యవనీపాలుఁడభివృద్ధి బొందు
పూని యేవురు మంతెప్పుడు సామభేద
దాన దండములు చితము దప్పజేయు
నెఱయ వానికిగల నీతి శాస్త్రములు

కొరమాలియుండు నిక్కువ మివ్విధంబు
పరసతి పరధన పరచిత్తుఁడెవ్వఁ
డరయ నాతఁడు కులమంతయు జెరుచు
నని కుంభకర్ణుఁడిట్లాడు వాక్యములు
విని రావణుఁడు క్రోధవివశుఁడై బలికె
దావిరి నను వెర్రివానిగా జేసి
నీవు శిక్షింపకు నిదురింప బొమ్ము
నిదుర బొయ్యెదవేని నిర్జింపరొరులు
కదురుగా రక్షించు కొమ్ము ప్రాణముల
ననిన రావణు జూచి యా కుంభకర్ణుఁ
డనియె నాతని మతం బంతయు దెలిసి
నావంటి తమ్ముడున్నత శక్తినుండ
రావణ నీకేల రణ విచారంబు
లుపమింపరాని నా యుగ్ర శూలమున
కపుల రాఘవులను బంధించి వత్తు
నని యన్నకును మ్రొక్కి యా కుంభకర్ణుఁ
డనికి సన్నద్ధుఁడై యార్చుచు లేచి
శూలి శూలము బోలు శూలంబు బూని
శూల రుద్రునిమాడ్కి గర్జించుకొనుచు
తనుజేరి దైత్యులుదగ్రులై గొలువ
తనుగాని దివిజులు కంపింపు చుండ
ధరణి పీలులు బాయ ధరములుడుల్ల
శరధులు కలఁగ దిక్చక్రముల్ పగుల
జనియింపరాని దుశ్శకునముల్ పొడమ
కని లెక్కగొనక లంకాపురి వెడలి

కడిమి వచ్చిన కుంభకర్ణుని జూచి
జడిసి యా వానర సైన్యంబు లెల్ల
చెదరి దిక్కులబారి చెట్లలో దూరి
వదలక మూర్ఛిల్లి వడిగ తెప్పిల్లి
ఘనశైల వృక్షముల్ కరముల బూని
దనుజ సైన్యములపై ధట్టించి దేవ
పదెడు రధంబులు భ్రమయు యోధులును
జడియు సారధులును సమయ గుఱ్ఱములు
త్రెళ్ళెడి గజములు తెగిపడువిండ్లు
మల్లాడు శూరులు మూర్ఛను కపులు
కలిగి భీకరమైన కదనంబు జూచి
తలకుచు దైత్యులు తన వెన్కబడిన
కని కుంభకర్ణుడు కపి సైన్యములను
ఘనమైన తోకలు కాళ్లను బట్టి
ధరణి వైచియు కాళ్ళదన్ని గూల్చగను
హరులు పారగ జూచి యంగదుండనియె
కపులార మీరిట్లు కదన రంగమున
విపరీత బుద్ధులై వెసపారతగవె
గక్కున మగుడుడు ఘనతతో యనిన
నక్కజంబుగ కపులద్రి వృక్షములు
నా కుంభకర్ణుపై నందంద నేయ
తోకతోనవియెల్ల చూర్ణంబు జేసి
కుతలంబు దద్దిల్ల కుంభకర్ణుండు
మితిలేని కపులను మ్రింగె మింగుటయు
కపులెల్ల వెరలిరి కర్ణ రంధ్రములు

కుపితుఁడై యార్చుచు కుంభకర్ణుండు
గదగొని వేసిన గద కిందనపుడు
సటమటమైరి యసంఖ్య వానరులు
పవమాన నందన ప్రముఖులాలోన
వివిధ పర్వతములు వృక్షంబులేయ
శూలంబుచే దాని చూర్ణంబు జేసి
వాలిన నిజశక్తి బాయుచు నడచె
నీవారు పిరనకను వనచరాధిపుల
గావించు నా కుంభకర్ణుని జూచి
సుగ్రీవుఁడప్పుడు శూరత మెరసి
యాగ్రహంబున నొక్క యచలంబువైవ
పడి కుంభకర్ణుని వక్షంబు దాకి
పొడిపొడియైరాలె భూధరం బపుడు
కాలాగ్నివలె కుంభకర్ణుఁడు పేర్చి
శూలి శూలముబోలు శూలంబువైన
సదిరాఁగ కనుగొని హనుమంతుడెగసి
తుదముట్టను దాని తునియలు జేసె
శూలంబు విరిగిన జూచి రాక్షసుఁడు
చే లీల మలయాద్రి శృంగంబు పెరికి
గురిగొని రవిజుపై కోపించియాయ
నొరలుచు సుగ్రీవుఁడుర్విపై బడియె
నచ్చట పడియున్న యర్క నందనుని
గుచ్చి చేతులనెత్తి కుంభకర్ణుండు
లంక లోపల రాగ లలనాజనంబు
పొక్కగా నతనిపై పూవులుజల్ల

తెలిసి సుగ్రీవుండు దిక్కులు జూచి
వెలవెలనై కడు వెరగున గుద్ధి
యిటు పట్టుబడితినే యీ దైత్యుచేత
పటుతరమూర్ఛచే బడియింత దడవు
నని తన కరముల నాదైత్యు చెవులు
బెనచి తమ్మెలతోడ పెరికిరా దిగిచి
లోటములుతోముక్కు బోసివోగరచి
పటుగతి మీదికి భానుజుండెగయ
నిమ్మల బోసిక యేచి రాక్షసుఁడు
క్రమ్మర నాతని కదగాళ్ళ బట్టి
నేలతో వేసిన నెగసి సుగ్రీవుఁ
దేలినపతి కడకేగె నయ్యెడను
తన ముక్కు చెవులునుద్ధతి బోవజూచి
కనలుచు నా కుంభకర్ణుండు మగుడి
తరుచరావళులను ధట్టించి పట్టి
మొరయంగ జలధిని ముంచె కొందరిని
వెస లంకలోపల విసరె కొంధరిని
విసువక నెమ్ములు విరిచె కొందరిని
హుంకించి యిట్లు వాఁడుగ్రుఁడై యార్వ
శంకించి వనచర సైన్యంబు కలఁగ
ఘన బాహుబలుఁడు లక్ష్మణుఁడు కోపించి
చనుమర నాటించె శరములేదింట
మరల పెక్కింట లక్ష్మణదేవుండేయ
కరకు రాక్షసుఁడు లక్ష్మణుని గై కొనక
కదఁగి యేతెంచు రాక్షసు వీక్షించి

కడు విస్మయంబంది కాకుత్స్థకులుఁడు
శరచాపములు బూని చనుదేరవేత
మురువైన గదగొని ముందర నడచు
నా విభీషణు జూచి యా కుంభకర్ణుఁ
డావేళ సంప్రీతిననియె నీతిగను
మన వంశమెల్లను మన్నించి బ్రోవ
మనువంశ తిలకుని మనసు రానడువు
నిలువక నా మున్ను నీవు పొమ్మన్న
నల విభీషణుఁడు దుఃఖాక్రాంతుఁడగుచు
తొలఁగె కన్నుల నీరు తొలుకుచుండగను
బలశాలి యగు రామభద్రుఁడావేళ
గారించు నా కుంభకర్ణుని జూచి
వోరి రాక్షసమాయ నొకట బన్నకుము
శూరుండవై లేని శూరత జూపు
పన్నగ సురసిద్ధ పతులు గాచినను
నిన్ను బోనియ్యను నిను నేఁడు ద్రుంతు
నన విని రాముని కనియె రాక్షసుఁడు
వినురామ నీవొక్క విప్రుని లేడి
తలలేనివాని వృద్ధగు మర్కటమున
పొలియించి మదిలోన పొంగుచున్నావు
నే కుంభకర్ణుండ నిర్జరాంతకుఁడ
నీకు నాముందర నిలువ శక్యంబె
యన విని రఘురాముఁడలిగి వేగమున
ఘన సాయకమ్ముల కడువడినేయ
పరువడి నా బాణ పంక్తులు గ్రోలి

కరముగ్రమైన ముద్గర ద్రిప్పుచును
నెదురుగా చనుదెంచు నింద్రారి జూచి
మది లెక్కచేయక మానవేశ్వరుఁడు
కవిసి యుద్భటగదా కలిత హస్తంబు
నవలీల బడనేసె యాయ బాణమున
నున్నదాపగిది చేత నొక పెద్ద వృక్ష
మున్నర ద్రోచుచుండవలీల నెరికి
ఇంద్రాదు లదరంగ నేతేరరాముఁ
డైంద్ర బాణమున నా హస్తంబు ద్రుంచె
చేతులు ముక్కును చెవులును లేక
యాతతంబుగ వికృతాకారుఁడగుచు
నరుగుదెంచుచున్న యా కుంభకర్ణు
నురవడి గనుగొని యుర్వీశ్వరుండు
దురమున ద్రుంచె తోద్దాన రాక్షసుని
చరణ యుగ్మము నర్ధ చంద్రబాణముల
నా రాక్షసుని వక్షమను వొంద జూచి
యా రామచంద్రుఁడైంద్రాస్త్రంబు నేసి
దనరారనంత నంతక శరంబేసి
దనుజ నాథుని గొప్పతల ద్రుంచివైచె
యా మస్తకముబోయి యబ్ధిలో బడియె
భీమ రాక్షసులెల్ల భీతి జెందగను
నప్పుడానందించి రఖిల గీర్వాణు
లప్పుడానందించిరఖిల వానరులు
చిరునవ్వు తనకొత్త శ్రీరాముఁడపుడు
సరసత విలసిల్లె జయలక్ష్మితోన

ఘనుఁడైన యా కుంభకర్ణుండు పడుట
విని రావణుఁడు శోకవివశుఁడై యపుడు
కడిమియై నైయ్యతి కాయుని జూచి
వడి రామ లక్ష్మణ వనచరావళుల
యనిలోన గూల్చి రమ్మనిన వాఁడపుడు
తన తండ్రికిని మొక్కి తనరథం బెక్కి
దనుజులతో మహోదర మహాపార్శ్వు
డిలనుపమ బలశాలియగు త్రిశిరుఁడు
కనక రథంబుల కడకతో నెక్కి
తనవెంట రాగను త్తత శ క్తిమీరి
శరచాప ఖడ్గాది శస్త్రాస్త్ర సమితి
శరమొప్ప సూర్య ప్రకాశమై దనర
దీపిత గవవాల్చి దేవాంతకుఁడు
రూపింప రుద్రుని రూపున వెడలె
అంతనాకృతి నినరాంత కుండపుడు
కుంతంబు చేబూని కుపితుడై నడువ
దిషారవంబుల నెల్ల దిక్కులను
ఘోషింప సేయుచు గుర్రముల్ నడువ
కొండల రీతినెకొ్కన్న కోపమున
దండల జెడి వేతండముల్ నడువ
కాల కింకర సమాకారంబులైన
కాలు బలంబులుగ్రతమున్న నడువ
పటాహ భేరీ శంఖభయద నాదముల
పటుతరనిస్సాణ ఝాంకారములను
దిక్కులు ఘూర్ణిల్ల దివి పెల్లగిల్ల

చిక్కులు దుల్ల వాసుకి తల్లడిల్ల
వచ్చి యా యార్భటు వనచర సేన
తొచ్చి బాణంబుల సోనలై గురియ
తరుచరులప్పుడుద్ధత శక్తి మించి
తరుల భూధరముల తరచుగానైన
కపులు దానవులకు లంకి యుద్ధంబు
విపరీతముగ సేయ వీక్షించి యపుడు
వాలి శక్తియై వాలినందనుడు
శైలంబు దెచ్చి యుత్సాహంబుతోన
వానరాంతకు మీద నలగి వేయగను
దానవుండప్పుడు ధరణిపై గూలె
నార్చిరి దేవతులాఖింట నుండి
యార్చిరి వనచరులవని స్థలమున
హనుమంతు డడిన దేవాంతకుండపుడు
ఘనమైన పరిఘంబు కడిమిదివ్వుచును
వడిరాఁగ కనుగొని వాయునందనుడు
పిడికిట నడునెత్తి బిట్టుగా బొడిచె
బొడిచిన యప్పుడు బొరిలొరి పండ్లు
కడుదుల్ల నెత్తురు గ్రక్కి భూస్థలిని
ద్రెల్లెదైత్యుండు గ్రద్దు తిరుగవైచుచును
తల్లడిల్లగ దైత్యతతులు బారగను
దేవాంతకుని పాటు త్రిశిరుండు జూచి
వేవేగ నీలుపై నిశిఖంబులేయ
నలిగి నీలుండు వాని యరదంబు నెత్తి
తలగొని యా మహావరు పైవైచె

ప్రై చినప్పుడు వాఁడు వసుధప్రై గూలె
జూచి దేవతులెల్ల చోద్యంబు నంద
త్రిశిరుండప్పుడు పేర్చి తివిరి మారుతిని
నిశిత బాణంబుల నెదియ నొప్పింప
అశని తుల్యాకృతి హనుమంతు డలిగి
త్రిశిరుని శిరములు త్రెంచివేయుటయు
త్రిశిరుఁడు భూస్థలి త్రెల్లె త్రెస్పుటయు
త్రిశిరుని పాటిల్లి ద్రిష్టించి యపుడు
పటు రౌద్రమున మహాపార్శ్వుండు కనలి
పటుఘన నిజగదాదండము దాల్చి
హనుమంతుపైపైవ హనుమంతుడలిగి
పెనచి రాక్షసు రొమ్ము పిడికిట పొడిచె
పొడిచిన రక్తముల్ బొదబొద గ్రక్కి-
మిడిగుడ్లు ద్రిప్పుచు మిగుల రోదుచును
పడితన్నుకొని మహాపాపాత్ముఁడా వేళ
విడిరి ప్రాణంబులు విబుధులుప్పొంగ
నా చందమున పౌరులందరు పడుట
జూఁచిన రోషణ విస్ఫురణ శోభిల్ల
మిత్రున లోకమ్ము మ్రింగుదుననుచు
కదఁగిన గరి త్రియకాయుండు చేర్చి
నదరారు సింహనాదము చెలఁగించి
పేరుజెప్పి పాడాగలిద్దం బిష్ట
కరావంబు నిగుడ కాలాగ్నిరీతి
రాష్టంబు లడ్డగింపు కవయు చలితమున
కపిసేనపై మహోగ్రంబు కోపాన

కపులు రాక్షసుని యాకారంబు జూచి
పటు రౌద్రలీల నప్పట్టా కుంభకర్ణుఁ
డిటువచ్చెనో యని యంతయు బెదర
పిడుగు మ్రైటాసిన పూన్కి బెట్టిదంబుగాగ
నదరి మ్రోయుచు వచ్చు నరదంబుమీద
ఇంద్రచాపముతోడ నీసవచ్చునట్టి
సాంద్ర ప్రభాయుత చాపమొప్పార
పరిఘ నవాప్రాస పట్టసశూల
పరశుతోమర భిండివాల చక్రాది
వర దివ్యశస్త్ర నివహంబుతోడ
సరుదైన సంహిసేయ ధ్వజంబొప్ప
నలువొప్ప నార్చుచు నలుగురు సూతనవ
ధులు దోల నొసవ యీతురగముల్ బూని
మూడు కన్నులుగల మూర్తియు బోలె
వేడిమి దిక్కులు వెరజల్లుకొనుచు
కపులపైనేతెర కపులంత జూచి
చపలులై వారనా సైన్యంబులోన
గంధనోదగ్రుండు గవయుఁ గోము
ఖుండును జ్యోతిర్ముఖుండు కుముదుండు
మరుతాత్మజుండును మైందుండు నలుఁడు
శరభుండు నీలుండు శతవలి గజుఁడు
నాడిగా గలుగు మహాయూధపతులు
ప్రోడిగా వృక్షముల్ భూధరంబులను
వడి నొగయెక్కి వడి వానికి నెదురు
నడిసె వారలజూచి నగ్గి దానవుఁడు

ఓ కపులార మీరూరక యిదక
లోకలు ముణుచు కౌతక లంక
యంభోధి నెఘనుండద్భుతంబుగను
ఘంభీర సాయకాగ్రంబున నిలిపె
నా మహాత్ముని జూపుంతనిపైగాని
యీము కొన్నట్టి నా యస్త్రంబు విడువ
పురమున నింద్ర జిత్తుండు గట్టినట్టి
యులగ పాశమ్ముల నూడ్చుకొన్నట్టి
యతఁడెవ్వండిట జూపుందతనిపైగాని
యతి భీమమైన యా యస్త్రంబు విడువ
రావణు పరిమార్తురణములో ననుచు
వారిరి లంకకు వచ్చియున్నట్టి
యతఁడెవ్వండిట జూపుందతనిపైగాని
యతి భీమమైన నా యస్త్రంబు విడువ
యని పెక్కు గర్వము లాడుచునున్న
దనుజాధి నాధుని తనయుని నిట్టి
తరుచర ప్రముఖులుద్దండులై పేర్చి
తరు గమశిరధరముల తరుచుగా నేయ
రదఁగి రూపులనతి కాయుండు ద్రుంచి
పదవైచి తోఁసనే ప్లవగ సంఘముల
రాముచేయిడి రయమున ముక్తి
కామిని మణిని నేఁగైకొందు ననుచు
దెచ్చెర కపులకు చెదరక తోలుచును
వచ్చి నవ్వుచును భూవరున కిట్లనియె
ఘోరాము మా వైరమొప్పునే నీకు

నీ రూపు నీలావు నే నెరుంగుదును
నీవు రాజని నేడు నేను వచ్చితిని
నీ వొక్క రాజువె నిన్ను జూడగను
దేవ సంఘములతో దృష్టించి జూడ
నీ ఒక్కండవుగావు నిన్ను నే గెల్వ
కులమును గుణమును గోత్రంబు కడిమి
నిలుకడమానంబు నీకెందు గలదు
పసువతిమునుల లోపల నుందునీవు
జనమర్థిబోనాడ నా యీడు గావు
తడయక వార్థిలో దాగిన గాని
విడువక నిన్నునే వెదకి పట్టుదును
కడుపులో తలబెట్టి కడు వేడుకొన్న
విడువను జూడు నా విక్రమ స్ఫూర్తి
కడిమి నోటను తుంగ కవ్వినగాని
విడువను జూడు నా విక్రమ స్ఫూర్తి
విడిచి కైదువ పండ్లు వెసజూపుచున్న
విడువను జూడునా విక్రమస్ఫూర్తి
వడి నిచ్చమెత్తెడి వాడున్న విడువజూడు
పుడమి వెల్పని జందెమునను జూపినను
విడువను జూడ తడయక నేనుండ తపసినేమన్న
విడువను జూడు నా విక్రమ స్ఫూర్తి
యని యిట్టులాడెడి యతి కాద్యుజూచి
ఘన శౌర్యుడైన లక్ష్మణుండిట్టనియె
ఓరి నీపాటనేనుండ రాఘవుని
తోరణం బొనరింప దొరకునే నీకు

సమరంబులోనింత చక్కగా నిల్వ
నిముషంబులో బట్టి నిన్ను వధియింతు
నన నతికాయుండత్యాగ్రహంబునను
కనలుచు శితసాయకముల నేయగను
శరముల ద్రుంచి లక్ష్మణుఁడు కోపించి
సురసిద్ధసాధ్యులు జూచి భూషింప
క్రూర బాణంబుల కుటిల రాక్షసుని
సారెకునేయ జర్జరితాంగుడగుచు
నతి కాయుడపుడు రామానుజు మీద
ప్రతి శరంబులువైచి భర్జింపుచుండె
నపుడు సౌమిత్రితోన నిలుఁడిట్లనియె
విపరీత శౌర్యుండు వీఁడు దుర్జయుడు
బ్రహ్మాస్త్రమున వీని పరిమార్పుమనిన
బ్రహ్మాస్త్రమంత సద్భక్తి సంధించి
సౌమిత్రి వాని లక్ష్యంబుగా జూచి
యా మహారాక్షసు నదరంటనేసె
నేసిన బ్రహ్మాండమెల్ల కంపించె
వాసవ ప్రముఖ గీర్వాణులు బెదరి
రా యస్త్రమును జూచి యతికాయుడపుడు
పోయక తనచేతి బాణంబులేయ
నదిలెక్క చేయక నా మహాస్త్రంబు
వదలక ప్రళయాగ్నివలె వచ్చివచ్చి
మండిత కోటీర మండలితోడ
కుండలంబులతోడ గూల్చె తచ్ఛిరము
హత శేషముఖమున నతికాయు పాటు

సతతంబుగా వీని సహసంత్రైయంత
రావణుండాత్మను రాము విక్రమము
భావించి భాసించి పలుమారు వగచి
అంతఃపురంబున కరిగి యక్కురుడు
నంతరంగంబున సడలుచు నుండె
నప్పుడు అరుదెంచి యా మేఘనాధుండి
నప్పం త్రికెందుకే ననియె నింపార
వగపేలదేవభూ నృపవానరుల
ఆగమెరుంగగ నేను సాధించివత్తు
ననివీడుకొని దివ్యమగు రథంబెక్కి
దనుజేంద్ర తనయుడెంతయు సొంపుమీర
నప్పుడుగ్రత చతురంగ సైన్యములు
కప్పి దిక్కులు నాల్గు కపయుచు రాగ
బహు భూషణప్రభా పటలంబు వెలుగ
సహజ వైభవ మహోజ్జ్వలు డింద్రజిత్తు
రక్త వస్త్రంబులు రక్తమాల్యములు
రక్త గంధంబుల రాజితుండగుచు
ననలు ప్రతిష్ఠించి నాహుతిజెంది
యనలుని కరుణ బ్రహ్మాస్త్రంబు రథము
ధనువుకో కవచంబు తద్దయు ప్రీతి
గోటియార్చుచు కపికోటులు బెదర
రథరథ్యకేతు సాంగములతో నెగసి
ప్రగణిత వేగమున నంబరవీథి దాగి
తరుచరీసేనల తాకి ప్రౌఢ్ధంత
పరువడితో క్రూర బాణంబులేసి

నా దివినుండి దివ్యాస్త్రంబు లేయ
నా దానవుని సేననగచరు లెగసి
నగములు పై వంగ నిపెద్రించి గుండె
తగలించి పెక్కండ్ర నవనిపై గూల్చి
నొక్కొక్క పురమున నొగి లక్ష్మణుఁడు
తక్కిన కపుల విదారించి వైచె
హనుమంతు డాదిగా సకల యూథముల
ఘన శరంబుల చాపములు గూర్చె
వనచరులెల్లను వసుధపై పడిన
కని లక్ష్మణుఁడు రాఘవున కిట్లనియె
దేవ బ్రహ్మాస్త్రంబు దీపింప చేరె
రావణాత్మజుని నే రయమున ద్రుంతు
ననుడు రాముఁడు వినికై జగంబులకు
హానరె భస్మముసేయు టుచితంబుగాదు
మనకు ననుచుంత రావణ యా రాఘవులను
కనుదేరవని మూర్ఛగా యినవంశజుల
వన నిధిలో బడినట్లు పడిగ్రుంకె సూర్యుండు
బలిమినీలాగు దెబ్బది రెండువేల
వలబాణ జలనిధి వలనొప్ప ముంచి
ఆలంబు చాలించి యా యింద్రజిత్తు
బాలంక లోపలి కరిగెనప్పుడును
అ యుద్ధరంగ సారథి విభీషణుఁడు
వాయుజుండును జాంబవంతుడు రణము
పరికింపుచును వచ్చి భల్లూకపతుఁడు
మారుతాత్మజు చూచి మారుతి నీవు

గొనిదెచ్చి మందుల నంటని కపుల
పసిఁజాంతితులను వడిఁబ్రోవు మనుఁడు
హనుమంతుఁడపుడు సుధాంబుధి చేరి
చనుపడి ఔషధ పర్వతంబునకు
పరువడి గొనిదెచ్చి బ్రతికించి వారి
మరలి గొంపోయి యున్మహిమంత గిరిని
అప్పుడానందించి రఖిల గీర్వాణు
లప్పుడానందించి రఖిల వానరులు
భానుజుండా రామభద్రుని కనియె
దానవానీక మంతయు చచ్చుకతన
రావణుఁడని రింకరాడు శ్రీరామ
కోపున యీ లంకఁగాల్చ వానరుల
బనిచెదనని యూధపతుల బొమ్మనిన
దినమండలము గ్రుంకనీక్షించి కపులు
గురుదిఁ యార్చుచు పెద్ద కొరువులుపట్టి
కొనిలంక కోటపై కుప్పించి దాటి
కడు జవంబున లంకగాల్చి పేర్చినను
జడిసి రాక్షసులు నిచ్చలు మొరలుపెట్ట
విని రావణుఁడు క్రోధ వికృతాస్యుఁడగుచు
కనుగవ కోపాగ్ని కణములు దొరుగ
దంభోళి తుల్య ద్రుతాత్ములైనట్టి
కుంభనికుంభుల క్రూర విక్రముల
ననుపవారలు శతాంగరూఢులగుచు
చనుదెంచి వానర సైన్యంబు దాకి
బడులు నూరువంద పదివేలు లక్ష

పదిలక్షలొక్కొక్క బాణంబు చేత
జతపైన వర బయూథపతులెల్ల దార
కడఁగి సుగ్రీవుండు ఘనశిలయెత్తి
కుంభునిపై వైచి కోయని యార్వ
కుంభుండప్పుడు గూలెకొండ చందమున
కుంభునిపోయ నికుంభుఁడు చూచి
దంభోళితుల్యాస్త్ర తతుల భానుజుని
నొప్పింప వాయు తనూభవుండదిగి
గుప్పున దృఢముష్టి గొనిరొమ్ము పొడువ
బడెను కుంభుండు కుల పర్వతులనగ
బడిన వానిని జూచి హర్షించిరంత
హత శేషులదినేర్చ నలిగి రావణుఁడు
మతిలోన చింతించి మకరాక్షుఁబనుప
వాఁడు రథంబెక్కి వాలినశక్తి
వేడిమి చూపుచు వీరవానరుల
దాకిన వానరుల్ తరులును గిరులు
దాఁకట గొనితెచ్చి వేయ వాఁడంత
ఖండించి శరముల కపులను తరుల
చండాంశుకులుఁడంత చాపంబు బూని
మకరాక్షుండేసిన మార్గణంబులను
శకలంబు గావించి విబుధులు పొగడ
వాని జోతనవెల్లపడి ద్రుంచివైచి
వాని నాగ్నేయాస్త్రవర్షించి గూల్చి
జగదీశ జయము నిచ్చలు చూడవచ్చు
పగిది పూర్వాద్రిపై భానుండు దోఁచె

విని మకరాక్షుని విధము రావణుఁడు
బనిచెప్పఁ ద్రుంచి మనులు నింద్రజిత్తు
వాఁడు హోమము చేసి వడిరథంబెక్కి
పోడిమి కృతితోన పొదవుసడాఁగి
సంధించి శరముల సంఖ్యంబునేయ
సంధకారావృతంబయ్యె భూస్థలము
నాయప్పసోనల నగచరుఁ బడఁగ
పాయక రాముఁడా బలిచె లక్ష్మణుఁడు
వీని మాయలతోన వీని వధింతు
మానవాధీశ్వర మన్నింపు మనుఁడు
నిను బ్రహ్మవరముచే వీఁడసాధ్యుఁడు
మున శస్త్రములు వీని మర్దింప చాల
వనుచుండ రాముతోన నీలుఁడిట్లనియె
అనల సాయక మేము మనవీశ వీఁడు
కనబడు బొమ్మలు ఖండింపుమనిన
కాలరుద్రునిరీతి కనలి రాముఁ
డాలోన నాగి యమసురపైనేయ
కృత్రియత్యద్భుత క్రియ నింద్రజిత్తు
నత్యంత గతివా॥ యరిగె నెందేని
అంత భూమికివచ్చి యా యింద్రజిత్తు
పంతంబుతోన బారంబు ద్రోయించి
విపరీతముగ సుగ్రవిశిఖంబు లేయ
కపివీరులటు తనుగారింప నార్చి
యారింట మారుతి నారింటకుముదు
నారింట నంగదు నారింట నీలు

నారింట పనసుని నారింట తారు
నారింట సుగ్రీవు నారింట వినతు
అరువదింటను రామునల్లు లక్ష్మణుని
శర శరంబున విభీషణు నేసియార్చి
సౌమిత్రి చాపంబు సర చతురుఁడై తునియ
రామచంద్రునితోడ రాక్షసుండనియె
కంటివే రామ నా కార్ముకప్రౌఢి
మంటిపాలైరి యీ మర్కట ప్రముఖు
లని యార్చి గర్వితుఁడగుచు లంకకును
చని తండ్రి తాతనడయమెల్ల చెప్ప
విని రావణుండు పుత్రుపీక్షించి బలికె
నరుల వానరుల ప్రాణముల తోడించి
దుశము గిల్పితి నన్ను బొరురునే కీర్తి
యేమిచ్చిరాశయ దేమిటి పోక
నీ మహత్వంబేమి నీ కార్యమేమి
భానుపంకజాల నోష్ణపసల గూర్చి
వీనుల కింపుగా వినుబంది తేని
నిష్ఠ కూరుండని నేయెత్తుననిన
భావించి యంతయుఁబలుమారు బలుక
దానునిమ్మని కోర్కె కడదేర్తుననుచు
తాను తండ్రికి మ్రొక్కి తగనింద్రజిత్తు
సీత చందముగాగ చెలువొప్పనొక్క
నాతి గాదన మాయ నపుర గల్పించి
అలయింద్రజిత్తు మాయాసీతగానుచు
వలనొప్ప పనమటి వాకిట వెడలి

అనికి సన్నద్ధుఁడై హనుమంతుఁడపుడు
వనచర బలముతో వచ్చిన ననియె
యీ సీతకొఱకు మీరిందరు కూడి
గాసి జెందెదరిపేళ ఖండింతు దీని
ననుచు ముందర బట్టి హుంకృతినిచ్చ
కనియింద్రజిత్తుతో కపి వీరుఁడనియె
వోరి రామద్రోహి వోరి దురాత్మ
యీరీతి పాపంబు కేల యొగ్గెదవు
విడువు దున్నను వాఁడు విడువక కురులు
కదగి శ్రీరఘురామ కావవే యనుచు
తలకు మాయాసీత తలదువ్వనేసె
గలిశేగి పటుసింహనాదంబు చేసె
హనుమంతు డవ్విధ య్యవనిజ పాటు
గని మూర్ఛ జెంది వేగమె మూర్ఛ దెలిసి
వనచరపతులన వ్వాకిట నునిచి
చనె రామున కీ సమాచారంబు దెలుప
తదనంతరంబు యా దశకంఠసుతుఁడు
చని నికుంబుని బిలిచె తోచిన భక్తితోన
నసలుని రుధిరమాంసాదుల దనిపి
హోమంబు చేయుచునుండె నవ్వలకు
ఆమారుతాత్మజుండరిగి వేగమున
శ్రీరాము తోడనా సీత చందంబు
వారక దెల్ప భూవరుఁడు మూర్ఛిల్లె
అవనిపై బడియున్న యన్నను యెత్తి
వివశుఁడై సౌమిత్రి వెసతోడ నుంచి

అక్కటరాదు నియబట్టి యుత్తమమున
కిక్కు కంకములు నీకెయిచ్చి చూడ
ధర్మమే జయమని తలఁతురు బుధులు
ధర్మమాపదలకు దగమూలమయ్యె
ధనహీనులెన్నెడి తలఁపులు ధరను
కొనసాగునెవట్టి కోర్కెలుగాని
సరసమైనట్టి రాజ్యము బోయినపుడె
పురుషార్థములు స్థితిబొందునేమనకు
కలవారు బంధులు గలవారు సుమ్మి
కలవారు తలఁచిన కాంక్షలీడేరు
ధనికుఁడే కులజుఁడు ధనికుఁడే దాతా
ధనికుఁడే పూజ్యుండు ధనికుడే బుధుడు
ధనముచే వర్తించు వర్తించు ధర్మాదులెల్ల
ధనమూలమీ జగత్త్రయము చూడగను
లేమి వచ్చిన యంతలేరు బాంధవులు
లేమి వచ్చిన యంతలేదు పౌరుషము
లేమి వచ్చిన యంత లేదు సౌఖ్యంబు
లేమి వచ్చిన యంతలేదు బలంబు
కావున రాజ్యంబు కటకటావిడిచి
వేవేగయా ఘోర విపిన భూములకు
వచ్చినప్పుడె కూడ వచ్చెయీ వ్యతలు
చెచ్చెర విధియంత చేసెనేమందు
అని లక్ష్మణుఁడు పల్కనా విభీషణుఁడు
వినయోక్తి శ్రీరామ విభుని కిట్లనియె
వేయాల రఘురామ వ్యసన నింద్రజిత్తు

మాయ యింతే కాని మహినొందు కాదు
దురితాత్ముడగు సురద్రోహి రావణుడు
ధరణిజ చంపింప దలంచెదెంతైన
హనుమంతు వంచించి యానికుంభిలకు
చనివాడు హోమంబు జలుపుచున్నాడు
హోమంబు పూర్తిగా నొనరించె నేని
రాఘవాని జయింప రాదెవ్వరికిని
కావున హోమ విఘ్నంబు గావింప
వేవేగ నీ మహావీరులక్ష్మణుని
పంపు మీ సౌమిత్రి పక్షిరావణుని
చంపనేర్వడన్న జననాధుడలరి
వినుము లక్ష్మణ నీవు వేగంబెయందు
చని యింద్రజిత్తును సమయించిరమ్ము
యీ వాయునందనుడీ విభీషణుడు
వానిరి తోడుగా వత్తురు నీకు
జయమునీకిత్తురు సకల దేవతలు
జయశాలివై రమ్ము చనుమని కార్ము
కాదుల దీవించి యను జన్మ నొసగ
సాదరమ్మున కొని సౌమిత్రి పొంగి
యన్నకు మ్రొక్కి యా హనుమంతు నెక్కి
పన్నుగా వనచర ప్రముఖులు గొల్వ
వెనువెంటగా నికుంభిల కేగుదేర
దనుజతుంగ తురంగదంతి శతాంగ
నివహోన్నత స్థలి నెలకొని హోమ
మవిరళంబుగ జేయు నా యింద్రజిత్తు

కని విభీషణుఁడు లక్ష్మణున కిట్లనియె
సౌమిత్రి రాక్షస సైన్యముల కాచిముంచి
హోమ విఘ్నము సేయు మొగి సేయకున్న
పీఁడసాధ్యుండన విని లక్ష్మణుండు
వాడిమి చూసి దురువార కోదండ
ధారియై శరములుద్ధతిని సంధించి
ఘోర రాక్షస కోటి గూల్చిన చూచి
యా యింద్రజిత్తుఁడౌక్కాహుతి దక్క
నాయన్నిలో కలుగు నాహుతు లెల్ల
వేల్చి పూర్ణాహుతి విహిత మంత్రముల
వేల్చక మున్నెయీ విఘ్నంబు పొడమె
నని పేర్చి కాలానలాకృతి పొదలి
సమ్మభీషణ పారుష్యం శనంబెక్కి
సముదగ్ర కార్ముక జ్యాని నాదముల
బ్రహ్మాండ ఖాండంబు పగుల కోపించి
సింహ నాదముజేసి గర్జించిజూచ
బ్రహ్మాదులెల్లను భయమొంది చూడ
శరపరంపరలను సకల వానరుల
పరిమార్చిరణ వీరభద్రుడై వచ్చు
నా యింద్రజిత్తున కనియె లక్ష్మణుఁడు
మాయబన్నక యింక మగవాఁడవైతె
నిమిషంబు నా ముందు నిలిచితివేని
సమర కాళికి నిన్ను చంపి బలియిత్తు
ననిన లక్ష్మణుజూచి యా యింద్రజిత్తు
కనులను కోపాగ్ని కణములు దొరుగ

కాలుండవై యుండి పంతంబు లేల
యీ లీల నిలుపు మీ యుంచుక తడువు
లక్ష్మణ నిన్ను నాలంబున వీర
లక్ష్మికి నెడబాపి లావెదలింతు
నని బల్కి వెంబడి యా విభీషణుని
కనుగొని యింద్రారి కలుషించి బలికె
పినతండ్రివిటనీవు ప్రియమాతనేను
తనయుండ నా కీడు తలపంగ తగునె
విడిచి బాంధవులను విడిచి సోదరుల
జనని శాత్రవులను శరణు జొచ్చితివి
యిది యొక్క కడిమియె యిదియొక్క బ్రదుకె
తుది జూడ కులఘాత ద్రోహివినీవు
నా వుండు దశకంఠనందను జూచి
యా విభీషణుతిట్టులనియె కోపమున
నా వర్తనము పావనము సురద్రోహి
మీ వర్తనమ్ముల మెచ్చరెవ్వరును
దశకంఠునికి నీవు తనయుండు గాఁగ
విశద ధర్మము నీకు విషమౌట యరుదె
దురితాత్ముడైనట్టి తోబుట్టునైన
పరిహరించుట యిది పరమ ధర్మంబు
పరకామినీ ధనపరులైన మీకు
చిరకీర్తులాయువు చేకూడ గలదె
యనుఁడు రావణు సుతుండాగ్రహంబునను
తనతేరు తోలించి తనపేరు బాడి
సౌమిత్రిపై విభీషణుమీదనపుడు

భీమ కాంతమ్ముల పెల్లుపెస
సరకు గైకొనక లక్ష్మణుడు కోపించి
శరవార్థిలోన రాక్షసు ముంచి వైచె
చెలఁగి యా యిద్దరు సింహనాదములు
బలువిడి వరగించు పాదఘట్టనల
పెలుపైసి చలముల నుఱ బలంబులను
విలసిల్లు నార్పుల విక్రమోన్నతుల
ననిశంబు వెలయు చంద్రార్కుల బోలి
తనరు చతుర్దంత దంతుల బోలి
కొమరారు సింగంబు కొదముల బోలి
కమనీయ శరజతారకులను బోలి
యేపార వృత్రామరేంద్రుల బోలి
రూపింపగా కాలరుద్రుల బోలి
బలివిడి జయకాంక్షపరఁగి నొక్కొకరు
నిలునిలు పోనీను నినుగూల్తు ననుచు
పలుకుచు చెలరేగి పంతగింపుచును
సరిసరిగా బాణసంఘ మేయుచును
శరలాఘవంబుల కదగి మెచ్చుచును
పోటిలో నీరీతి పోరుచునుండ
నా రావణాత్మజుండధిక కోపమున
నురగాస్త్ర మప్పుడత్యుగ్రత నేయ
గరుడాస్త్రమునద్రుంచె కదగి సౌమిత్రి
తగ కుబేరాస్త్రమ్ము దానవుండేయ
జగతీతముగ ద్రుంచె నతఁడు మర్మమునే
సమతేంద్రద వైరి వాయ్వాస్త్రమేయ

సమర నాతఁడు ద్రుంప నైగ్నేయాస్త్రమునను
దానవుండపుడు గాంధర్వాస్త్రమేయ
దాని లక్ష్మణుఁడు రౌద్రమ్మున ద్రుంచె
చలమున నిటు వారు సమరంబు సేయ
ప్రళయ కాలమునాటి పగిదియై తోచె
నంత లక్ష్మణుఁడు నయ్యంతకు కరణి
నంతకంతకు నుగ్రుడై యింద్రజిత్తు
నటజూచి రామునికజ్ఞాని నాదంబు
పటుశక్తి నొసరించి బహురయంబునను
పేర్మినైంద్రాస్త్రంబు పెనుపొంద తొడిగి
ధర్మాత్ముఁడగునేని దశరథరాముఁ
డగణిత విక్రముండతి సత్యసంధు
డగునేని సాయక యసురారియైన
రావణి తలద్రుంచు రయమున ననుచు
భావించి యేసిన ప్రళయ చండాంశు
మండలోగ్ర ప్రభామండితంబగుచు
చండవాత భీల సమవేగమగుచు
ఖండితారాతి చక్రమురీతి వచ్చి
కుండలంబులతోన కూల్చె తచ్ఛిరము
యనిలో బడియున్న యా యింద్రజిత్తు
కనుగొని విజయ శంఖంబు పూరించి
లక్ష్మణుం డతులిత లక్ష్మణుఁడు జయ
లక్ష్మిచే వెలిసె నాలంబుతో నపుడు
కరమర్థి లక్ష్మణు కౌఁగిట జేర్చి
మురుదొంది వినుతించె నవ్విభీషణుఁడు

పసుపతి కపులెల్ల ప్రణుతించి రతను
యనుమోదించ నుతియించి రఖిల దేవతలు
సుమ వృష్టులంటంత సోనలై గురిసె
ధిమిధిమియని మ్రోగె దేవదుందుభులు
వనచర సంఘము వ్యాలిగా గొల్వ
చనుదెంచి సౌమిత్రి సద్భక్తితోన
రామునికిని మ్రొక్క రాముఁడుప్పొంగి
ప్రేమతో తమ్ముని బిగి కౌగిలించి
గొనకొని శిరము మూర్కొని విభీషణుని
కొనియాడుచును సుఖగోష్ఠి నందుంత
అత్తరి రాక్షసులా యింద్రజిత్తు
వృత్తాంతములం జెప్ప విని రావణుండు
వెగలింపు మనచాటు వెటలించిరంత
వెడలి రాక్షసవీరు లార్పుచును
వికృత వేషంబులు వికృత ఘోషములు
వికృత నేత్రంబులు వికృత గాత్రములు
కలిగి భయంకరాకారులైనారు
న్విలపిల దిశలెల్ల పిక్కటిల్లగను
ఠిఠిఘుటా ఘుంకార ఘుటికానేక
తురగ ఘోషారావ దుందుభి శంఖ
పటహాఢమామికా పణవాది వాద్య
పటు సీకరధ్వజ పటపటాత్కార
రథనేమి శింజినీరావ సంకులమై
ఉదధిత్వర్ణవ ధ్వనిమాడ్కి శోభిల్ల
కరమర్థి తెందూళి గగనంబు గప్ప

పరమ లంకాంబుధి బడబాగ్నులనగ
నేల యీనినయట్లు నిబిడంబుగాగ
నాలంబు తైవాహనా రూఢులగుచు
కాలమేఘమ్ముల కరణి నాగ్నికాగి
బలిమెత్లె తెప్పిల్లి పరఁగు కోపమున
భూమిజపతిచూచి పుత్రశోకంబు
నామీద నేర్తునేనని నిశ్చయించి
చంద్రహాసము బూని చనుదెంచు రాక్ష
సేంద్రుని కద్దనై యెలమి సుపాంశుఁడును
సురేశయిది ధర్మహానితలఁపగను
సరియని తలచుట సాటిగాదెపుడు
నసమూన కోపమూ యర్క వంశజుల
సైజూపవలెగాని భామిని ద్రుంచి
వైచుట నీతియే వలదని బుద్ధి చెప్పి
రావణు దెచ్చి సింహాసనమున
నెప్పటివలె నుంచె యేపు మీరగను
తన మంత్రులను జూచి దశముఖుండనియె
కనుగొంటి రే నేడు కాలకౌటిల్య
మనుపమ బలశాలి యగు నింద్రజిత్తు
మనుజుఁ డొక్కఁడు గూల్చె మాటలింకేల
వలనొప్పనొక బాధవచ్చిన వేళ
తలఁకు చుండుట వీర ధర్మంబు గాదు
నదుల వానరుల రణస్థలంబునను
పరిమార్చుచును కాలరుద్రుని మూర్తి
కపులపై దాకిన కపులు కోపించి

వీపరీత పర్వత వృక్షంబులెత్తి
దేరివా సైన్యంబుపై దట్టించియాయ
దనుజాలు కపులనుద్దలి తాకిరపుడు
వాటుల వ్రేటుల పడినిండునేందు
పోటుల నేటుల పోరినినిండందు
కరవాలములను భీకర వాలములను
శరముల భీమము ధరములనైన
తరుచరులావై సంగదజాలువైవ
ధరణిపై పెను రక్తధారలు దొరుగ
వనచరుల్ దనుజాలపడి తాకితాకి
కనుకను చేనున్న గిరుల గ్రుమ్మియును
పీకె గోరమ్ముల విరుగ ద్రొక్కియును
మోకాళ్ళ మోచేత ముష్టినుట్టసల
తాకించి తలలు ద్రొక్కియును
తోకల గొట్టి తుత్తుమురు చేసియును
పొట్టలు చీరియు పోసికజూట్టి
చట్టలు వాపియు చదియవ్రేసియును
కరచియు విరిచియు కడకాళ్ళుబట్టి
జిరజిరగా త్రిప్పిచిమ్మి వైచియును
పెళపెళ నెమికలు పిండిసేయుచును
ఢిఢియని భూతపంక్తులు పొగడ
నీరు చేతులందును నిరుపురి బట్టి
పోరిపోరి తాకించి పోట్ళ సేయుచును
తరుచరులార్వంగ దనుజాలు జూచి
పరిగదా చక్రపట్ట సప్రాస

పరశుతోమర భిండివాల త్రిశూల
కరపత్ర కుంతముద్గరముల బూని
నరికియు నడచియు నలయమొందియును
నురువడి కుమ్మియు నురగ చిమ్మియును
చనుజాలార్చి జూచి తరుచరుల్ బెదరి
జననాథు మరుగున చనిన రాఘవుండు
నెమ్మితో దానవ నికరంబు జూచి
సమ్మోహనాస్త్రంబు సంధించి యేయ
నన్యోన్యమును రాములని రోషమునను
జన్యంబు గావించి సకల రాక్షసులు
ఖండితావయవ నికాయులై యవని
నిండార బడిసిరి నిమిష మాత్రమున
నా వార్తవిని రాక్షసాంగన లంత
రావణుపెను హజారముజేరి యందు
మొనయ శోకముల కొమ్ముల మొందుకొనగ
విని రావణుండు కోప వివశుండై యపుడు
సకలాయుధావృత సంపూర్ణ రత్న
చకచక ద్యుతియు తస్యందనంబెక్కి
దివ్య భూషణములు దివ్యాంబరములు
దివ్య మాల్యంబులు తేజరిల్లగను
దానవ ప్రభులిరుదండల గొల్వ
సానా మృదంగ నినాదముల్ మొరయ
తడయక నుత్తర ద్వారంబునందు
వెడలి యుద్ధోన్మత్తు వెసవిరూపాక్షు
కనిబల్కె మీదనీ కపిసైన్య తతుల

ననిలాశ్య ఘటియింపుదంతలో నను
మనుజుల రామలక్ష్మణుల నిర్జింతు
అని బల్కి దానవులార్చుచు వెడలి
వనచర బలముల పడతాకి తాకి
ముసలతోమర దాముద్గర చక్ర
పీసరముల్ వైతు పీచి పెల్లేచి
యంకు శకుంత శూలాదుల పొడుతు
రంకించి నేయుదురాభీల గదల
సడిదముల్ ఝళిపించి నలుకసంగముల
కడిబందలుగనేసి కడిమి చూపుదురు
కపులును కుపితులై కడిమి పాటించి
రిపుల శైలంబుల వృక్షజాలముల
పదదంత నఖవాల పాశహస్తముల
సదముతై యా రాక్షసావళినెల్ల
శిరములు నరములు బయలు మూతుఁ
లురుములు బాణాపులా ప్రకంరములు
త్రెంచియు దంచియు తీవ్రవైఖరిని
చించియు నొంచియు చిదిమియు నదిమి
తరుచరావళులను దనుజాలంతరము
పరువడి యా విరూపాక్షుం డర్కజుని
శరముల నొప్పింప బలజాప్రసుతుఁడు
కరముష్టి వాని వక్షస్థలంబునను
పిడుగుతు నట్టియైన పిడికిట బొడువ
పడగూలె నా విరూపాక్షు డంతటను
పడిన విరూపాక్షు పాటెల్లజూచె

యుపరి యుద్దోన్నతుండర్కజా మీద
కనలుచు నడువ నంగదుఁడు కోపించి
కినుకతోఁదుత గొప్ప గిరియెత్తి వైవ
తునియ సంగములు నెత్తురులు గ్రక్కుచును
దనుజుండు మిడుకుచు ధరణిపై గూలె
నంత రావణుఁడు కాలాంతకు పగిది
పంతంబుతోన చాపంబుచేఁ బూని
కాల భుజంగ సంకాశ బాణముల
కీలించి కపులను గిట్టబెట్టేయ
గడగడ కంపించి కపులు దిక్కులను
బడిసి పారగ రామసౌమిత్రులపుడు
శరధుల తూణముల సంధించి గొబ్బె
పరువడి కోదండ పాణులై నిలువ
దశముఖుండలుకను దశదిశ దాక
దశరథ రాముపై తన తేరు బరుప
సౌమిత్రి యెదురుగా శరములు నేయ
సౌమిత్రి శరముల సరకుగా గొనక
రావణుఁడేతెంచి రాము మార్కొనియె
రావణుదాఁకె నా రఘువీరుఁడలిగి
రామ రావణులు సౌరథమ్ము లెసఁగ
సీమ భీర్మక గుణాధరనాదముల
శరధులు కలఁగంగ నగములు పగుల
పరువడి నన్యోన్య బాణసంతతుల
ఘనభోంతరముల పోలుపారనిండె
దానవాధిపుడేసె శతాఖి ప్రశరము

ఘనమైన చీకట్లు గ్రమ్మినా తిమిర
మనల బాణమ్మున నణచె రాఘవుఁడు
వాసిగా నంత రావణుఁడు కోపించి
యా సురాస్త్రం బేయ నందున బెక్కు
ముఖముల శార్దూల ముఖములనుష్ట్ర
ముఖములు సూకర ముఖముల మకర
ముఖములఁ గరి వైరి ముఖముల దంతి
ముఖముల గృధ్రముఖముల మూ[illegible]
ఘనసిత ముఖములై కడు నెక్కు నిగుడ
గని వాని శునకలుగా జేసి మగుడ
ఇనకనాథుఁ డాగ్నేయ శరమేయ వహ్ని
దినకర ముఖములై దిశలందు బరువ
నన్యోన్య మిట్లు ప్రత్యస్త్రముల్ వేసి
జన్యంబు గావించు సమయంబునందు
నెదజొచ్చి లక్ష్మణుండేడు బాణముల
నతి గేహరథిని చాపము ద్రుంచివైచె
నా విభీషణుండంత హయములు గూల్చ
రావణుండొక శక్తి రయమున బూని
తమ్మునిపైవైవ దశరథ రాము
తమ్ముఁడా శక్తినుద్ధతి ద్రుంచివైచె
నదరి రావణుఁడపుడా మయ శక్తి
వడిగ విభీషణు మీదవైన హుంకింప
శరణు జొచ్చిన విభీషణుని పిమ్మటను
సరగున నిడుకొని సౌమిత్రి నిలువ
తనపైకి శక్తిని దశముఖుండపుడు

ఘన శౌర్యుఁడైన లక్ష్మణు మీఁదవైచె
వైచిన శక్తి దుర్వార దిర్మిక
రోచిత జిహ్వాసముగ్రమై వచ్చి
యా లక్ష్మణుని వక్షమందు జొచ్చినను
తోలెనా సౌమిత్రి ధరము లోపలను
సౌమిత్రి వడియున్న చందంబు చూచి
రాముఁడు శోకాంబురాశిలో మునిగి
పలపల కంటను బాష్పముల్ దొరుగ
వలనొప్ప శక్తియవ్వల తీసివైచి
కపులను జూచి యా రాఘవుడిట్లులనియె
కపులార మీరు లక్ష్మణు కాచియుండు
డనిలోననెందు దశాస్యువధియింతు
అని బల్కి శోకంబునటు కట్టిబెట్టియా
దండ ధర భీకరాయతంబైన కో
దండమప్పుడు గొనఁగ మెక్కించి
అరుణారవిందాక్షుఁడై రాఘవుండు
శరపరంపర నిట సంధించి యార్చి
రావణుపై నేయ రావణుండలిగి
కావరంబున భీమ కాండంబు లేయ
పంచాశుకులుఁడు రాక్షసుని కాండముల
ఖండించి కాలాగ్ని కైవడి కనలి
నొకట కార్ముకమున నొకర్మైజ్యాను
తునియంగ నేసి సూతుదురు జేసి
ఘనకాల భుజగ భీకర సాయకముల
వడిబేర్చి రావణుసు వక్షంబులనేయ

జడిసి బాణముల జర్జరి తాంగుడగుచు
ఆరక్త ధారల నంగంబులదర
తేరుపై మూర్ఛిల్లె తివిరి రావణుఁడు
భయమంది సారథి బవరంబు విడిచి
రయమున గొనిపోయె రథము దవ్వులను
గొనిపోవఁజూచి కాకుత్స్థ వంశజుఁడు
మనమున మన్నించి మగుడి వేగంబె
చేరి చింతాక్రాంత చిత్తుఁడై రాము
డారవితన యాంగదాదుల కనియె
నా జీవమైనట్టి నా కూర్మితమ్ము
డీ విధంబునసుండ నికనేది బ్రతుకు
తనకేల శౌర్యంబు తనకేల రణము
తనకేల మానంబు తనకేల సీత
యితనితోడిదె లోకమింతియె గాక
నితర చింతనము లింకేటికి తనకు
నాకూర్మి నిలకడ నా పట్టుకొమ్మ
నాకన్న పెన్నిధి నా నోముఫలము
నా తమ్ముడిటువలె నన్ను వంచించి
భూతలంబున నిద్రబోవుచునుండ
యెటువలె చేగింతునెట్లు సహింతు
కటకటాయగుచు శోకంబున పొగిలి
చింతింపుచుండ సుషేణుఁడు వచ్చి
యంతరంగమున ననియె రామునికి
వలవని శోకంబు వలదు శ్రీరామ
కలుగునే హాని లక్ష్మణ దేవునికిని

నిండుచందురు గోమునెమ్మోము వికచ
పుండరీకెంజాయ పొలుచు నేత్రములు
విలసిల్లుచున్నది వేరొండు లేదు
కల దుపాయము వేగ కరువడి సుతుని
పనిచిమందుల కొండ పరఁగ దెప్పింపు
మన రామచంద్రుండు హనుమంతు ననుప
నావాయు నందనుండనిల వేగమున
ఆవేళ చనిదెచ్చి నౌషదగిరిని
కరిమర్థి యౌషధాఘ్రాణంబు వలన
మరలె జీవములు లక్ష్మణుని కంతటను
నిదురబోయిన రీతినెరియ మేల్కాంచి
సదయుండు సౌమిత్రి సద్భక్తితోన
రామచంద్రుని పాద రాజీవములకు
ప్రేమతో మ్రొక్క సంప్రీతి రాఘవుండు
రమ్ము నా పెన్నిధి రమ్ము రమ్మనుచు
తమ్ముని కౌగిట దయతోడ జేర్చి
శిరము మూర్కొని చిన్ని చెక్కిలినొక్కి
కరమర్థి సంతోష కలితుఁడై యుండి
యా విధంబున లేచి యఖిల వానరులు
భూవరునికి మ్రొక్కి పొలిపొందిరంత
నప్పవనాత్మజుఁడపుషద శైల
మెప్పటితావున నిడివచ్చెనపుడు
తూణీర కలితనిస్తుల బాహుమూల
బాణ బాణాసనపాణులై రామ
సౌమిత్రులప్పుడు సమరాంగణమున

సోమసౌఖ్యల రీతి శోభిల్లిచూడ
అప్పుడా రావణుఁడా మూర్ఛదెలిసి
తప్పక సారథి తగజూచి బలికె
కలుషించి రిపుడుండ కడిమి నా రథము
తొలగించినప్పుడే ద్రోహి వీవనుఁడు
సారథిబలికె రాక్షసనాథ సధికు
కారణంబున కొంత యలసిన యంత
సడలింపవలె తేరుసమయంబు దెలిసి
నడిపింపవలె నిది న్యాయమ్ము సుమ్ము
దేవర మూర్ఛిల్లి త్రిప్పితి రథము
కావున నీకేగ కాదని దెల్ప
విని రావణుఁడు వాని వినుతించి మంచి
తన భూషణమ్ము లాతనికిచ్చి మెచ్చి
నేడు లక్ష్మణ సమన్వితుని రాఘవుని
పోడిమితో పోరిగొందు ననుచు
కాలదండాకార కార్ముక జ్యాలర
హిలోల చండ భీమార్భటుల్ మొరయ
వడి మహాటావుల దుర్వారత బేర్చి
కడగి యుగ్రతకాల్చు కార్చిచ్చు మాడ్కి
నగణిత స్ఫుటవహ్నులా శుగమ్ములను
నిగుడించి క్రోతల నీరు జేయుచును
రాముని రక్షోభి రాముని భాను
ధాముని సంగకోద్దాముని దాఁక
దేవేంద్రు ననుమతి తెరఁగొప్పవచ్చి
యావేళ మాతలియనియె రామునికి

శరణాగతత్రాణ జయధామ రామ
పురుహూతుఁడిదె నీకు పుత్తెంచె రథము
కాకుత్స్థ యీ వజ్ర కవచంబు బూని
శ్రీకర రథమెక్కి శిక్షించు వీని
యనవిని యా మునియవ్విభీషణుని
యనుమతితోడుత నా రథంబెక్కి
చదల నొక్కట సర్వజయజయధ్వనులు
పొదివి శాఖామృగంబులు సంతసిల్ల
సురువడి కమలాప్తుఁడుదయాద్రి నెక్కు
కరణి యా రథమెక్కి కమలాప్తకులుఁడు
శరదభ్ర సంధ్యాభ్రచయ సమానములు
గరుడోరగాసుర గణ విమానములు
సరిఁజూచు సురలు ఖేచరులుఁ గిన్నరులు
పరువడి ఆగములు భయమందనపుడు
వననిధి యుగము పాతకయుగంబు
ఘనగిరి ద్వంద్వంబు గగన యుగ్మంబు
కదిసి పోరాడె దినకరణి శౌర్యంబు
వదలక రామరావణులు పేర్చుచును
దినకరానల కల్ప దీర్ఘ నిర్ఘాత
సునిసితాస్త్రంబులు సొరది మేనులను
కరముల భుజముల కర్ణమూలముల
నురముల ముఖముల నూరు కాండముల
నెక్కి నొప్పించుచు నిద్దరు కడిమి
మిత్రాసులై దొరశి విత్రాసులై మెరకి
యార్పకయ్యేము కాయ యప్పుడొండొరుల

సొంపు పెంపును త్రెంపు చూపుచు ఘోర
నలినవిధ్ధమురారి నారి సంధించి
తలకొన్నదేవ గంధర్వ బాణముల
పరువడి వేయంగ ప్రతిబాణములను
మురియలుగా చేసె మొనసి రాఘవుఁడు
అనలాస్త్రమేసె లంకాధిపుండపుడు
జనపతి వారణాస్త్రంబు సనణె
అరసి రావణుఁడురగాస్త్రంబు యేయుటయు
గరుడాస్త్రమున ద్రుంచె కాకుస్థకులుడు
కనలి రావణుఁడు రాక్షస బాణమేసె
వనజాక్షుఁడది ద్రుంచె వాయువ్యాస్త్రమున
సురవైరి కోపించి శూలంబు వైచె
దురమున శక్తిచేదునిమె రాఘవుఁడు
పది ముఖంబుల వాఁడు పంతంబుతోన
పది విండ్లుచేబూని పది దిక్కులదర
శరవృష్టి ముంచిన సురనాథుఁడపుడు
సురపక్షగాదులు చోద్యంబునంద
తానేక కోదండ ధారియైయుండి
వాని కస్త్రము లెల్లపడి ద్రుంచి వైచె
రావణుండలుక తారఘురాము మీద
వావిరి నమ్ముల వానలు గురిసె
గుదికొన్న కోపంబు కొలది మీరగను
పదియింట మాతలి పదియింట హరుల
వికల సత్వుల చేసి విషమాస్త్రమేసి
ప్రకటంబుగా ద్రుంచె పటు చేతసంబు

విపుల చింతాభార వివశు డైవిభుఁడు
తపియింపుచుండ నత్త్రిరియగస్త్యుండు
చనుదెంచి ఆరామచంద్రునీక్షించి
ఘనుజేరయిది శౌర్య మంత్రంబుసార
ఘనువంద పఠియించి అరిని నిర్జింప
మని కుంభసంభవుండరిగిన పిదప
ఆదిత్య కులనాథుండతి భక్తితోన
ఆదిత్య హృదయ మంత్రావర్తిచేసి
ఘోరావలోక నాగ్నులు ప్రజ్వరిల్ల
భూరి ధూమ్రాయత భృకుటి నిట్టింప
చండతేజమున ప్రచండకాండముల
నిండార నసురపై నిగుడించి చూచి
ఖనశాత కర్తరి క్రకచ భల్లంబు
యినవంశ వల్లభుఁడే సగ సందించి
నరుడంత కాంచె నద్దశాననుడి
శిరములు బడియును చేతులిర్వడియు
కరములిర్వడియును ఘన కిరీటముల
శిరములు బడియును చెచ్చెర మొలిచె
మొలచిన కోపించి మొనద్రుంచె పొగడ
తలలును చేతులు తద్దయు మొలిచె
తలలును చేతులెంతయు ద్రుంచిద్రుంచి
అలసి రాఘవుఁడుండ నవ్విభీషణుఁడు
దేవ రాఘవవీఁడు తెగఁడెందు చేత
వావిరి సుధనాభిపడినుండజేసి
అనల బాణంబేసి అమృత మింకించి

మనుకొని బ్రహ్మాస్త్రము నశియించి చంపు
మనవుడు రఘురాముడాగ్నేయ బాణ
మనుపంచనేయ నయ్యమృతంబుగ్రోలె
ఒక తలతో కరయుగ్మంబు తోన
ప్రకటించి నిలిచిన పంక్తికంధరుడు
అక్షయ బలశౌర్యుడగు రామచంద్రుడు
రక్షయ బ్రహ్మాస్త్రమపుడు సంధించి
దేవారి యురముపై ప్రయోగించి యేయ
నావేళ బ్రహ్మాండమగల దిక్పతులు
ఘల్లిల్ల లోకముల్ బెదిరి కంపింప
పాతాళవాసులు భయమందియురక
వచ్చియా రావణు వక్షస్థలంబు
వ్రక్కలు చనుదెంచి రాపుస్తకులని
అమ్ముల పొదచొచ్చెనద్భుతంబుగను
అమ్ముల పొదచొచ్చె నద్భుతంబుగను
పరమేష్ఠి మనుమని పంక్తికంధరుని
దురమున చారిగొన్న ఘోషంబుతోడగ
పాతాళ గంగలోపల గండివచ్చి
సీతాధిపతిమాట చేరెనో యనగ
తలదుడు కూలె నద్దశకంఠుడపుడు
కూలి సాహసిని బద్ధకొంచ చందముగ
సంతసిల్లెను దేవ సంఘమ్ములపుడు
సంతసిల్లెను కపిసైన్యంబులెల్ల
దివినిండ మ్రోగెను దేవ దుందుభులు
భువినిండ గురిసెను పుష్పవర్షంబు

ఆడిరి చెలరేగి యప్సరస్త్రీలు
పాడిరి గంధర్వపతు లుత్సహించి
రాముఁడు లోకాభిరాముఁడై విజయ
ధాముఁడై నవసుధా ధాముఁడై యొప్పె
నంత విభీషణుఁ డన్నను జూచి
సంతపింపుచు నుండె సమర మధ్యమున
నపుడు మండోదరి యాదిగా గల్గు
చపల లోచనులెల్ల సకల భూషణము
సడుగులు తడబడ హారముల్ చదర
తొరటబడి కన్నీరుతోపలై రొరుగ
వచ్చి యా సంగరవసుధ నీక్షించి
రచ్చట మిన్నంది యాడు భూతములు
దయతోడ తమ బంధుతతులను బిలిచి
ప్రియముతోడుత విందుబెట్టు భూతంబు
నా రక్తధారల నందంద గ్రోలి
శ్రీరాము సన్నుతి సేయు భూతములు
శిరముల మెదడులు చిగురు మాంసములు
పరువడి భక్షించు బ్రహ్మరాక్షసులు
ఘూక కాకపిశాచ ఘోరబేతాళ
శాకినీ భీకర సమరాంగణంబు
తొచ్చి ముందరను నిస్తుల కాంతియ్య
వచ్చి నెత్తురుతో పడియున్న వాని
వీర లక్ష్మీఘన విరహాగ్ని వలన
కారి నిద్దురబోవు దశకంఠు జూచి
తరుచుగా విలపింపదనుజ కామినులు

పరగ మండోదరి పతిమీద వ్రాలి
హా! రాక్షసేశ్వర హా! మహావీర
హా రణలంకాపురహానాథ యనుచు
పలుమారు లంకాధిపతి పరాక్రమము
తలఁచి శోకింపుచు ధరణిపై వ్రాలె
అంత రాముఁడు రావణానుజు జూచి
చింతింప వలవదు శీఘ్రమే నీవు
పరఁగ రావణునికి పరలోక విధులు
కరమర్థిఁ జేయుము కరుణతోఁ బోయి
యనుఁడు విభీషణుఁడౌఁగాక యనుచు
దనరంగ నటువలె తగనాచరించి
పరిశుద్ధుడై వచ్చి భానువంశజుని
చరణాంబుజములకు సాగిలి మ్రొక్క
జనవిభుఁడా విభీషణుని మన్నించి
చనవు రెట్టించగ సౌమిత్రి కనియె
మొనసి మండోదరి మొదలైన దనుజ
వనితల మన్నించి వారి దోడ్కొనుచు
నీవింక లంకలోనికి బోయి పుణ్యా
త్ముఁడు విభీషణు పట్టంబుగట్టి
రమ్ము పొమ్మనపుడు రామానుజుఁడు
నెమ్మితో లంకలోనికి బోయి యపుడు
తదయుక్త తదుపరిత్రములను బనిచి
తరఁగి సముద్రోదకముల దెప్పించి
హరి పురోహితవరులతో గూడి
వారి సుమంత్రుల వరుస రప్పించి

భూరి మంగళ తూర్యములు మ్రోయనతనీ
యా రూఢ నియతితో నభిషిక్తుజేసి
కరమొప్ప యతని లంకా రాజ్యమునకు
పరమ సమ్మతమున పట్టంబుగట్టి
జలనిధులును సూర్యచంద్రులెందాక
కులగిరులును తార కోటు లెందాక
జగతి యందాక దిక్చయము లెందాక
జగదేక రామ చరిత మెందాక
నందాక నీవు లంకాధి పత్యంబు
చెంది వర్ధిల్లుము శ్రీరాము కరుణా
నను విభీషణుఁడ బల రాజ్యంబు
గొనిపుంచి తొడవులు కొంచు సౌమిత్రి
కొలచి వెంబడివచ్చి కులవలయాధిపుని
కలరుచు మ్రొక్కి దివ్యాభరణములు
చెలువొంద నిచ్చిన చేకొని రాము
డెలమితో మాతలికిచ్చి పీడ్కొలుప
మాతలి రథమెక్కి మహనీయ మహిమ
నూతత రథ వేగుఁడై బోయె దివికి
తదనంతరంబున ధరణివల్లభుఁడు
మదిని విరాజిందీ మారుతి జూచి
జనక పుత్రికి మనజయము సేమంబు
వినుపింప లంకకు వేగపొమ్మనుఁడు
చని హనుమంతుఁడు జనక నందనను
కని మ్రొక్కి నిలిచి యోకల్యాణ రామ
ధరణీశ్వరుఁడు వచ్చి దశముఖు గూల్చి

పరమ సంతోష సంభరితుడై నాఁడు
పరగ సౌమిత్రి సద్భక్తి కొల్వఁగను
తరుచరావళు లెల్ల తను భజింపగను
మున్ననే జెప్పిన ముఖ్య భాషణము
లన్నియు నిజమయ్యెనని విన్నవింప
దేవి సంతోషాబ్ధి దేలిమారుతిని
భావించి దీవించి పలుమారు పొగడ
హనుమంతుడందున యసుర కామినుల
కని తల్లియును నీకు కాని యీపట్ల
ఘన ముష్టినిహతుల కడదేర్చి బుత్తు
ననుచుండ జానకి హనుమంతు జూచి
యేసినవాడుండ నిమిషులేమిజేయు
దాసీవధంబెందు తగదు చింతింప
వీమ్ము నాయెడ ప్రేమ పొసమెయట్ల
నెమ్మితో బలుకుము నృపవర్యు ననిన
విని మ్రొక్కి మారుతి వేగంబె బోయి
జననాథునికి సమాచారంబు జెప్పె
జననాథుఁడా విభీషణుచార బిలిచి
జనకజ మంగళస్నానంబు సేయ
బనచి దివ్యాంబరాభరణ మాల్యముల
పనువడి జేయించి పరగతో దెమ్ము
మనుడు విభీషణుఁడంగనా మణుల
పనుపహాయులు బోయి పరగకై జేసి
యసమాన మహిమతో నసుర కామినులు
పసిడి పల్లకియందు పణతుక నునిచి

దెచ్చి దూరంబున దేవిని దిపిచి
వచ్చి రాఘవునికావార్తలు చెప్ప
పిలిచి తెమ్మనుడు విభీషణుంతలిగి
కేవల భక్తితో కీర్తించుకొనుచు
దేవి జానకితో దెచ్చుచో కడిసి
ఘనవేత్ర హస్తులై కపులు రాక్షసుతో
కనుగొని సందడి కడకుతొలగను
నామహా కలకలంబప్పు జాలించి
రాముండు రాక్షసరాజు నీక్షించి
నింత వారెవ్వరు పీరితో ననరు
యింత నొప్పింతురె యిట్లంగి కడcగి
వారింప వలవదు వచ్చియందరను
గారవమ్మున సీత గనుగొని నిమ్ము
ననుcడు విభీషణుcడా రామునాజ్ఞ
గనకాంగితో దెచ్చె గరిమె తోడుతను
కోమలి నేత్ర చకోరయుగ్మంబు
రామ చంద్రానన రాకేందు కళల
గ్రోలి వియోగాగ్ని గున్పన నణచె
నాలోన సంప్రాప్యమై సీత నిలువ
మానిని జూచి యమ్మనుజేశుcడనియె
మానంబు రక్షింప మర్దించి రిపుని
తివిసె నిన్ను సాధించితిగాని
యువిద నీయెడ ప్రీతి యొక్కింతలేదు
పగవాని కొంపలోపలయున్న నిన్ను
తగిలి సుఖించుట ధర్మమే తనకు

ననపుండు జానక యాత్మలోపుగిలి
కనుల బాష్పమ్ములు గ్రమ్మ నిట్లనియె
యెరుగవే నీవు నా హృదయంబు రామ
పరకాంతవలె నన్ను పలుకుట తగవె
నీ సంశయము బనించిన యపుడె
శోకతో నగ్నిలో జొచ్చెదననుచు
ఆననాథ కనుసన్న సౌమిత్రి దెలిసి
పెనుపొందనట సౌర పేర్చెనంతటను
మడిరాతి ప్రణమిల్లి మదిలోన రాము
కడియించి సౌదచుట్టు గరిమెతో తిరిగి
వనజాయతాక్షి కేవల భక్తితోన
ననల దేవునికిని హస్తముల్ మొగిచి
సకల ధర్మములార చంద్రార్కులార
ప్రకటింతునిపుడు నా భావంబు వినుడు
ఘన మనోవాక్కాయ కర్మములందు
ఆననాథుడగు రామచంద్రుడు దక్క
పరుథవించితినేని ప్రళయాగ్ని నన్ను
పొరిగొనుకాక నిపుడె చూడుడనుచు
జలజాక్షి సంతత జ్వాలాకరాళ
కలితాగ్నిలో జొచ్చి కదలక నిలిచ
యా విభీషణు లక్ష్మణార్కజ ప్రముఖు
లా వేళ శోకార్తులై యుండిరంత
సర్వలోకంబులు చెలియింపసాగె
నిర్వాణుడై యుంట స్నపుడంతలోన
పరమేశ్వరుడు పద్మభవుడు దేవేంద్ర

గరుడ గంధర్వాది ఖచర వల్లభులు
వర విమానస్థులై వచ్చి యంబరును
పరఁగ ప్రత్యస్తోసవరుడైన రాము
కని నుతింప జగత్కారణ మీవె
వనిపతిగా పరబ్రహ్మంబు నీవే
నీవె వేదంబులు నీవె శాస్త్రములు
నీవె లోకంబులు నీవె సి రథులు
నీవె యక్షరములు నీవె మోక్షంబు
నీవె సాక్షివి రామ నిత్యుఁడు నీవె
నరనాథ నీవారి నారాయణుండ
వరసీ జూడగ సీత యయ్యాది లక్ష్మి
నిన్నాళ్ళలు తెలియవు నిష్ఠుర వసీ
నున్న సీతను జూచుచుండుట తగదె
జనకజ చేకొమ్ము జగదేకనాథ
యని పెక్కు భంగుల నాడుచుండగను
విశ్వమంతయు జూచి విస్మయంబొంద
వైశ్వానరుండంత వదలని ప్రేమ
కోమలి తగనెత్తుగొని వచ్చి వేగ
రామునితొడనుంచి రామతోననియె
సరసగుణ భ్రాత జగదేక మాత
పరమ పతివ్రత పావని సీత
యీ కాంత యెడ పాపమిందాకన్నైన
చేకొని రక్షింపు శ్రీరామ యనుఁడు
వసుధీశుఁడపుడు దేవతలఁ కిట్లనియె
కుసుమ కోమలి సీత క్రొత్తయే తనకు

వలయు ధాత్రీపుత్రి మనసు మర్మంబు
తెలివిడి తనకన్ని తెలిసినగాని
యరసి నేనిపుడు లోకాపవాదంబు
పరిహరించుటకై పద్దు జేసితిని
యను నంద్ర శేఖరుంతతని కిట్లనియె
దనరగ మీ తండ్రి దశరథాధీశుండ
దేవి మారూఢుడై యున్నవాఁడు
కదిసి పూజలు నీవు గావింపు మనిన
నను జన్మతో రాముడతి భక్తినేగి
తన తండ్రి నీక్షించి తద్దయు మ్రొక్క
చిత్తము రంజిల్ల శ్రీరామచంద్రు
నెత్తి కౌగిట జేర్చి యినవంశుఁడనియె
నా కూర్మి నందన నా రామచంద్ర
కైకేయి మాటకై కటకటా నిన్ను
బాసితి సుఖమింత బడయలేనైతి
గానికి లోనైతి కడు వెర్రినైతి
పరువడి నిను నేడు చూచిన వలన
సురలోక సౌఖ్యంబు శోభించదయ్యె
నీ వయోధ్యకు బోయి నిఖిల ధర్మములు
భావించి రాజ్యంబు పాలింపు మనుచు
ప్రేమతోడుత పల్కి ప్రియ సుతుండైన
సౌమిత్రి కనుగాని సౌమిత్రి నీవు
మెలకువ నిటుమీఁద మీయన్న మనసు
నలగకుండగ నీవు నడుపుమీ యనుచు
ఘన భక్తితో మ్రొక్కి తలవంచి యున్న

జనక నందన జూచి జననాథుఁడనియె
పరమ పతివ్రతా చరణంబు నీకు
సరి యెవ్వరుత్తమ సాధ్వివి నీవు
నిను రాముఁడాడిన నిష్ఠురోక్తులను
మనమున నెంచక మది నొవ్వబోక
ఘన కీర్తియుతుల రాఘవుబోలు సుతుల
కనుము ధర్మంబులు కైకొను మనుచు
దీవించి చెలఁగి ధాత్రీపతి సుతుల
భావించి సంతోషభరితుఁడై యుండె
సురపతి రఘురాము జూచి నీకిత్తు
వరములు కోరుమన్న వసుధేశుఁడనియె
నా కార్యమునకు రణంబుతో నెదిరి
యీ కపుల్ ప్రాణమ్ము లిచ్చియున్నారు
వీరల బ్రతికింపవే దేవయనుఁడు
వారల బ్రతికించె వాసవుండపుడు
వనచరు లెల్లను వర్ధిష్ణులగుచు
కనిసి రామునికి మ్రొక్కిరి ముదంబునను
దేవ సంఘమ్ములు తివిరి రాఘవుని
దీవించి వేవేగ దివి కేఁగెరంత
నా విభీషణుఁడు దివ్యాంబరమ్ములు
జీవరత్నంబులు చిత్ర వస్తువులు
తెచ్చి రాఘవులకు దేవి భూపుత్రి
కిచ్చి వీడికి బిల్వాసంపుడనియె
కడఁగి యుద్యోగముల్ కడు పెక్కు గలవు
తడయక మాకయోధ్యకు బోవలయు

విను విభీషణ కపుల్ వీరు లంకేంద్ర
ఘన సర్వ ఘోరాంధకార భాస్కరులు
వీరి పూజింపుము వేగంబె యనుఁడు
వారికి తోడవులవ్వారిగా నిచ్చి
నానా మణి స్రంత నవరత్న చిత్ర
నానాంబరోవృతోన్నత కేతనాంక
పుష్పగంధార్చిత స్ఫుట రాజరాజ
పుష్పకంబప్పుడాప్పగ దెచ్చియుంచె
జనకజా లక్ష్మణ సహితుఁడై రాము
జననాథుఁడంత పుష్పకము పూజించి
తగ ప్రదక్షిణముగా ఘనత పుష్పకము
జగతీశుఁడెక్కె యుత్సాహంబులోన
కడఁగి సుగ్రీవాది కపులను జూచి
కడగండ్లకోర్చి యీ కార్యముల్ జేసి
యలసియున్నారు మీకాత్మగేహముల
కెలమి బోందనుఁడు వారాసించి రాము
సమరంగ నీదు పట్టాభిషేకోత్స
వము జూడవలె నన్నవారి మన్నించి
పరువడితోన పుష్పక మెక్కుమన్న
పరపు పావనులు పుష్పక మెక్కిరంత
దనుజాంగనలు మహీతనయకు మ్రొక్కి
చనిరంత నిజ నివాసములకు నెలమి
ఘన భక్తితోతన కరములు మోడ్చి
జనపతి కా విభీషణుం డిట్టులనియె
యెలమి యీ పుష్పక మెంటతెక్కఁగను

విలసిల్లి యొక పూల వెలితియైయుండు
ననరాము లసుపున సఖిల స్లనంగు
లనుపమాయత పుష్పకారుండులైరి
సామక గంధర్వ సంచరితు తలిత
హేమాద్రియన మింటికెగసి పుష్పకము
ఘన మనోవేగంబు గైకొనిపోవ
జనకజతో రామచంద్రు డిట్లనియె
యీలంక జానకి యీక్షింపు దీని
యేలజాలక భోగమెల్లను మాని
సుదయితుండై వచ్చి మార్కొని నన్ను
పది ముఖమ్ములవాడు బడియె నిచ్చటను
కడఁగి యిచ్చట కుంభకర్ణుఁడు గూలె
పడె ప్రహస్తుండిందు పద్మాయతాక్షి
యిచ్చటధూమ్రాక్షు డిచ్చట కుంభు
డిచ్చట నతికాయుఁడిచట నికుంభు
డిచ్చట మకరాక్షుఁడిచటను పోర్మఁ
డిచ్చట పడిగూలె నింద్రజిత్తుండు
బతిగావసధిపై భాసిల్లు పుణ్య
హేతుసేతువు జూడు మిందీవరాక్షి
యిదె సదాశివ సమాహిత నివాసంబు
మదిరాక్షి సేవించు మనసు రంజిల్లు
యిదె గంధమాధనమిదె దర్భశయన
మదెవాలి పాలితమైన కిష్కింధా
యన రాము గనుగొని యాసీత బలికె
మనుజేశ సుగ్రీవు మగువలతోన

మన పురంబునకేగమరి కోర్కెలుబ్బె
ననవుండు పుష్పకంబై యదనిచ్చి
తారాది కాంతల దనరగప్పింప
వారు సీతకు మ్రొక్కి వలనొప్ప పుష్ప
కారూఢులైనంత నరిగె పుష్పకము
శ్రీరాముఁడాడుతోడనే సీతను జూచి
ముగిదె ముందర ఋశ్యమూకంబు జూడు
చిగురు బోణారొజూడు చెలఁగునీ పంపా
జలజ బాంధవ తనూజాత సఖ్యంబు
కలిగె మాకెక్కడ కమలాయతాక్షి
యిదె పంచవటి జూడుమిదె పర్ణశాల
యిదె రావణుఁడువచ్చి యెలయించి నిన్ను
కొని చన్నతావు గన్కొన జూడుమటల
మునియగస్త్యాశ్రమమును జూడు మింతి
మిదె శరభంగుని యాశ్రమంబటల
మిదె యత్రియాశ్రమ మిదె చిత్రకూట
మిదె భరద్వాజుల యాశ్రమంబనుచు
పొదలి సీతకును జూపుచురాగ నంత
పదునాలుగవ యేడు పరిపూర్ణముగను
పదపడి వర్తించు పంచమినాడు
స్రాంత తపతేజుఁడగు భరద్వాజు
కాశ్రమో పరవీధిన వ్విమానంబు
పాయక నిల్పి సద్భక్తితో దిగ్గి
యా యాశ్రమంబున కర్థినేతెంచి
యమ్మునికిని మ్రొక్కి యతఁడు దీవింప

సమ్మతి రామచంద్రు డిట్లనియె
కలదుగదా మీకు కందమూలములు
ఫలములు జలములు పాయంబులేక
నెరవేరుచున్నదే నిత్య కర్మములు
చిరుశుభంబులె మీకు శిష్యులకెల్ల
ననవుడు మునినాథుడా రాము జూచి
వినయ వాక్యమ్ములు వినిసంతసిల్లి
నిఖిలలోకారాధ్య నీవు జన్మించి
నిఖిల లోకంబులు నిష్టపాలింప
కలదె సంకటములు కలనైనగాని
చెలువొప్పగా నీవుజేసిన సాహసంబు
తెలిసెను సుజ్ఞాన దృష్టిచే మాకు
నిలిపి పాదు కలను నిఖిల రాజ్యంబు
భరతుడు మునివృత్తి భక్తితో బూని
గురుగాని నీరాక గోరుచున్నాడు
నీవు నీ తమ్ముని వినయంబు దలచి
వేవేగబోవ భావింపగ వలయు
వనవాసము నడసి వచ్చిన వారద
వనఘుమాయాశ్రమ మందునేడుండి
బోవుదునని విందు బొలుపొందనందు
గావింప రఘుతి కపులతో గూడి
పనుపడి భుజియించి పరితృప్తిబొంది
హనుమంతు జూచి నీ వరిగి వేదంబె
మొసనిసందీ గ్రామమున నున్న భరతు
కైనయంగమారాక నెరిగింపు మనుడు

కరములు మొగిడించి కపికులోత్తముడు
భరతు చెంతకుఁబోవ భరతుఁడా వేళ
రాఁడాయనింకమా రామచంద్రుండు
కీడేమి బుట్టెనో కెరలి రాఘవుల
కని తల్లడిల్లుచు సటుసొర బేర్చి
చనియనే ఘోరజూచు సమయంబు జూచి
వలదు హోహోయని వారించు కొనుచు
వలనొప్ప వచ్చి యా వాయునందనుఁడు
భరతుని కపుడు భక్తితో మ్రొక్కె
నరలోక పాల మిన్నాకముదంబునను
జానక లక్ష్మణ సహితుఁడై రామ
భూనాథుఁడిదేవచ్చె పొందుగా ననవుఁ
డామాటలమృతంబై పొడసోక
తామేను మరచి చిత్రరులోలి యుండి
పులకలు నెమ్మన లొదమనేత్రముల
పలుమారు నానంద బాష్పముదగ్రమ్మ
కదుకూర్మి హనుమంతుఁ గౌగిట జేర్చి
తడయక కపికులోత్తమ శిఖామణికి
కరి తురంగ శతాంగ కాంచనా భరణ
నరసాంల కాదుల సంప్రీతి నొసఁగి
హనుమంతు చేత నప్పుడా రామకథలు
వినికూర్మి తమ్ముని వీక్షించి సేపు
సాకేతపురమెల్ల సంతసంబునను
శిఖరంబుగను కైసేయించు మిపుడు
గానగాని శ్రీరాము కొలువు పాటమున

ఘనసేతు బంధాది కథలు వ్రాయింపు
నవరత్నమకరతోరణము లెత్తించు
నవరణ వీధుల చక్కబెట్టించు
యలిరోచి మృగనాభినంగళ్ళయందు
వెలలేని వస్తువుల్ వేయించు మచట
కోట వాకిండ్లను కొమరొప్ప నీవు
హాటక రంభాదులమర కీలించు
శ్రీరామ విభుఁడు వేంచేసినాడనుచు
వారివారికి బంధువర్గమ్ములకును
తీరుగా వ్రాసి పత్రికల నంపించు
దారుచే సీమ దాటింపుమనుచు
భావించి శ్రీరామభద్రుని నగరు
నీవు సన్నిధినుంచి నెరియక్తై సేయు
మనవిని శత్రుఘ్నుఁడాగాక యనుచు
చనయట్లు గావించి సరగున వచ్చె
సరస వసిష్ఠాది సంయమీశ్వరులు
పురినున్న జనములు భూసురోత్తములు
తల్లులు మంత్రులు తగిన బాంధవులు
పల్లవింపుచు రాగ భరతుఁడు కదలి
రాముని కెదురుగా రయమున రాఁగ
నా మారుతాత్మజుండనియెనాతనికి
గలదెటోఁడు రాఘవుఁడా భరద్వాజు
సదనంబునందుండి చనుదెంచు రవము
లదె జాడు పుష్పకంబదె జూడు రాము
నదెజూడు సౌమిత్రి నదెజూడు సీత

నదెవాఁడు సుగ్రీవుఁడదె విభీషణుని
నదెవాఁడు అంగదు నదెవాఁడు నీలుఁ
డని విని భరతేశుఁడవ్విమానంబు
కనుగొని దాసుడౌగ టొరంతవగుచు
ఘనత దవ్వుల కడుభక్తి మ్రొక్కి
యన్నను సాష్టాంగమపురంగ జేసి
యంతనా పుష్పకంబవనికి డించి
యంతయు హర్షించి యినకులేశ్వరుఁడు
దండిగ భక్తితో తల్లులకెల్ల
దంత ప్రణామముల్ తగనాచరించె
పరువడివారలు పరఁగ దీవించి
పరిరంభణముల సంభావించిరపుడు
భరత శత్రుఘ్నులు ప్రణమిల్లి రంత
పరిపూర్ణుఁడగు రామభద్రుని కెలమి
యత్తరి భూపుత్రి యధిక సంప్రీతి
యత్తల కెల్లను యతిభక్తి మ్రొక్కి
మ్రొక్కిన కోడలి మొగి కౌగిలించి
యొక్కట దీవించి యుండిరందరును
నరగున రామలక్ష్మణుల సద్భక్తి
గురువసిష్ఠునికిని కొమరొప్ప మ్రొక్క
యాలింగనముచేయ యతడు దీవించె
నాతోన భరతేశుఁడర్కపుత్రాది
కపుల నందరి తన కౌగిట జేర్చి
విపుల సమ్మోదమున వినుతించె నంత
తన బాంధవులతోన తల్లులతోన

దీన నాథవత్సలుఁడు నంది గ్రామమునందు
వచ్చెనా భరతుండు వటని పాదుకల
నిచ్చి సామ్రాజ్యమ్మయ్యెడ నొప్పగించె
తమ్ములతో గూడరసర రాఘవుఁడు
నెమ్మితోడను గూడి నిడుద కెంజడలు
సదరించి వడిశుభ స్నానముల్ జేసి
కడువడి మునివృత్తి కానల కనచి
దివ్య భూషణముల దివ్యాంబరముల
దివ్యగంధమ్ముల దివ్య మాల్యముల
కరమర్థి ధరియించె కాకుత్స్థకులుఁడు
ధరణి తనూజకు దశరథాంగనలు
కరము ప్రియంబుగ కై జేసిరంత
గరిమె రాముడు పుష్పకమున పూజించి
పనిచె కుబేరుని భవనంబునకును
గొనకొని మారుతి గుహుని తోడ్తేర
ఘన జటావల్కల కలితుఁడై గుహుఁడు
చనుదెంచి శ్రీరామచంద్రుని చేరగ
నతని కౌగిటజేర్చి హర్షించి రాముఁ
డతని వల్కలజటలపుడు తీయించి
కనకాంబరాదుల కై సేయ బనిచె
పనిచిన శృంగార భరితుఁడై గుహుఁడు
ఘన భక్తితో రాఘవుగొల్చి యుండె
తన వారితోడుత దశరథాత్మజుఁడు
కనక రత్నప్రభా కలిత శతాంగ
మునవెక్కి వనచర ముఖ్యులు గొల్వ

పంచ మహాకావ్య పటునాదయనగ
సంచితంబుగ భేరులా పరప మొరయ
శ్రీకర సకల లక్ష్మీధామమైన
సాకేతపురి రాగ జననాథవిభుడు
తనకు బంగారు సౌధముల రాజిల్లి
చెలియలు ముత్యాల వాసలు జల్లి
స్వస్తి వాచనముల సకల భూసురులు
ప్రస్తుత పూర్ణకుంభము లొప్పతెగ
జగములుప్పొంగ నిర్జరులు నుతింప
నగరు ప్రవేశించె నరనాథుడంత
భరతుడు శ్రీరాము పంపున నపుడు
సరసాన్న ఫలభక్ష్య సద్వస్తువులను
పరితృప్తులను జేసి ప్లవగ వల్లభుల
సొరది సుగ్రీవుని జూచి యిట్లనియె
శ్రీరాము పట్టాభిషేకంబునకును
భూరిని కదినట పుణ్యతీర్థములు
తెప్పింపమనపుడు దిననాథ సుతుడు
తెప్పించె కపులచే తీర్థమ్ములన్ని
యంత వశిష్ఠ సంయమి మహామునుల
సంతసంబున గూడి సమ్ముహూర్తమున
కనకరత్న ప్రభాకలిత పీఠమున
జనకజతో రామచంద్రుని నునిచి
ఘనరసామాది వేదములు ఘోషింప
మునులు మహామంత్రములు పఠింపగను
ఘనుపడి తీర్థ సంభరితంబులైన

కనక కుంభములు కరముల బూని
శ్రీరామునకు నభిషేకంబు సేయ
వారి పూరంబుల వ్వారిగా నింపె
చిరకాంతి నుదట భాసిల్లు పట్టమున
పరఁగెను శశికళా భరుణుని మాడ్కి
కిన్నర గంధర్వ గీర్వాణ యక్ష
పన్నగోరగ సిద్ధ పతులుత్సహింప
కురిసె పువ్వులవాన గుప్పున నవ్వ
తెరగొప్ప మ్రోగెను దేవదుందుభులు
పాడిరి గంధర్వ పతులు రంభాదు
లాడిరి వీచె మందానిలంబంత
సురపతి మందార సూనమాలికలు
కరమర్థి నంపింప గైకొని రాము
ధారూఢి సింహాసనా రూఢుడయ్యె
భూరిన స్యాదుల పొలచె భూదేవి
ఫలసుమంబులతోన భాసిల్లె తరులు
విలసిల్లె దిక్కులు వెలిసె లోకమ్ముల
లాలోన రఘురాముడర్థ రాసులను
వేలారు కోటుల విప్రుల కొసఁగి
లక్ష గుఱ్ఱముల లక్ష యేనుగుల
లక్ష ధేనువులను లలినొప్పనిచ్చెఁ
కాంచన సుమమాలికా భూషణంబు
లంచితంబుగ నిచ్చె నటుభూసుతానికి
కనకాంబరమ్ము లంగదునికి నొసంగి
హనుమంతునికి కంకణాదుల నొసఁగి

హారకేయూర దివ్యాంబరంబులను
సారంబుగా విభీషణునికి నొసఁగె
ధనమెల్లనిచ్చె భాస్కరసముగా నీలునికి
నవరత్న పతకంబు నలునికి నొసఁగె
ధరణి తనూజకు దయతలర్పగను
మురువుగా నిచ్చెను ముత్యాలదండ
శ్రీరామునను మతి సీత సంప్రీతి
హారమర్పించె నాయాంజనేయునికి
హారంబు ధరియించి యనిల నందొప్ప
శారదాభ్రావృత శైలంబు మాడ్కి
ఘనత వసిష్ఠుని యనుమతి రాముఁ
డంతఃపురమున కరిగి సంప్రీతి
తన తల్లులకు మ్రొక్క దయమీరవారు
దనర దీవించిరి ధరణితనూజ
యత్తలకు మ్రొక్క యవనితనూజ
నెత్తి కౌఁగిట జేర్చి యెలమి దీవించి
రపుడు రఘురాముఁడఖిల బాంధవుల
నర్చించి వానర రాక్షసాధిపుల
నమిత భక్తినిడుకొని సరసాన్నములను
కొమరొప్ప భుజియించి తాంబూలంబులను
జలముల నొగినార్చి సంభ్రమంబునను
లలిత సుగంధమాల్యము లొప్పముడిచి
కలితానురాగులై కడఁగిరందరును
శ్రీరాముఁడప్పుడు చెలఁగి సింహాస
నారూఢుఁడై సభ నందరి చెలిమి

కపురపు వీడెముల్ కనకాంబరాదు
లుపచార పూర్వకమొసగి వీడ్కొలుప
యా విభీషణ భానుజాదులు మ్రొక్కి
వావిరి తమతమ నివాసంబులకును
జనిరి శ్రీరాముఁడుత్సవ కేళిదేలి
పసవడి యువరాజ్య పదమున భరత
మనుభవింపుచు రాముఁడవనిజతోన
సౌమిత్రులను నిల్పి సామ్రాజ్య సౌఖ్య
మామహీజను గూడి యనుభవింపుచును
రాజిల్లి రాముఁడు రహిఁ నశ్వమేధ
వాజపేయాదుల వరుస జేయుచును
ధర్మంబు నీతియు తప్పక ప్రజల
కూర్మిబ్రోచుచు పదకుండు వేలేండ్లు
పాలించె రాజ్యంబు ప్రజల ధర్మాత్ము
లై లక్షణాఢ్యులై లమరిరపుడు
తూలె దుర్భిక్షముల్ తొలఁగె పాపములు
తాలిమియును సత్యధర్మముల్ బొల్చె
పరహితాచారుతత్పరులైరి మనుజ
అరుదుగా సంపదలభివృద్ధి పొందె
అనిభోసలాబ్ధి సుధాంశుఁడు త్రముఁడు
ధననాథతుల్యుఁడు దార విక్రముడు
సరస సాహిత్య లక్షణ చక్రవర్తి
కరుణా సముద్రుఁడు కవి కల్పకంబు
విలసిల్లు తుళజ భూవిభుకుమారకుఁడు
పొలుపొందు మేకోజి భూమిపాలకుఁడు

తన తండ్రి తుళజేంద్ర ధరణీశు పేర
పెనుపొంద సుకరంబ నిరుధాంబు పేర
రమణీయమైన యీ రామాయణమున
కమనీయమైన యుద్ధకాండంబు జెప్పె
నిదితుళజేంద్రుల కిడునెప్పుడిలను
పొదలు సంపదలును పూర్ణశక్తులును
సకల దీర్ఘాయుష్య సంతానములును
సకల రాజ్యంబుల సకల భోగముల
సమర జయంబుల సకల కీర్తు
లమరంగ నొసంగు మహారామ చరిత
మిది మహాపుణ్యద మిది వేదసార
మిది ముక్తిసోపాన మిది శుభోదర్క
మివ్వసుంధర భక్తి నెలమితో దీని
నెవ్వరు చదివిన నెవరు వినిన
నెవరు వ్రాయించిన నెవరు వ్రాసినను
భువిలోన వారికి పుత్ర సంపదలు
ఘనమైన కీర్తులు కరితురంగములు
మనసు రంజిలజేయు మానినీ మణులు
పరగ దీర్ఘాయుష్య భాగ్యంబు లొసగు
ధరణిలో నాచంద్ర తారార్కముగను

—: శ్రీరామ చంద్రాయనమః :—







**డా॥ ఎం. బాగయ్య**

జన్మస్థలము : గ్రా॥ మొరంగపల్లి, తా॥ మర్పల్లి, జి॥ రంగారెడ్డి.

విద్యార్హతలు : M.A; M.Phil; Ph.D; P G. Diploma in Applied Linguistics

ఉద్యోగము : తెలుగు లెక్చరర్, ఉస్మానియా విశ్వవిద్యాలయ మహిళా కళాశాల, కోఠి, హైదరాబాదు

అభిరుచులు : తెలుగు భాషాసాహిత్యముల అధ్యాపనము, అభినయము, వ్యాసరచనాభిలాష

ప్రచురణలు : 1. సింహాచల మాహాత్మ్యము - ఒకపరిశీలన, M.Phil.

2. ఏకోజీ విఘ్నేశ్వర పరిణయము - పరిష్కరణ

3. ఏకోజీ రామాయణము - ద్విపద - పరిష్కరణ - సంపాదకత్వం

4. కూచిమంచి తిమ్మకవి జీవితము-సాహిత్యము, Ph.D.

5. చిరవిభవ శతకము - పరిష్కరణ - సంపాదకత్వం

6. భాగ్యరేఖ - కవితాసంపుటి